శ్రీ ర స్తు.

శ్రీ మద్గురుభ్యో నమః

శ్రీమద్వేదాంతసారుండును నాదబిందుకళాతీతుండును
ప్రకృతిద్వయ దోషరహితుండును సచ్చిదానంద
స్వరూపుండును, అద్వైతశాస్త్ర సిద్ధాంతుడైన
శ్రీమత్సందడి వంశపయః పారావార రాకా
సుధాకరుండగు నాగయాచార్య శ్రీసద్గురు
అరుణకిరణ మృదుకమల చరణారవింద
మరందబిందు తుందిల మదవదిందింది
రాయ మానసుండగు
పెనుగొండ - ముకుందదాస రచితంబైన



# బ్రహ్మజ్ఞానామృత సారము.

...శిష్య సంవాదమనే ఈ గ్రంథము,
గురు... ...దభూత దోషంబులు లేకుండునటుల
లేఖక ప్రమ... ...రింపంబడి
స... ...న్న పు రి
... ...గరాయశాస్త్రులచే
బళ్ళారు - తా... ...శ్రీకర ముద్రాక్షరశాలయందు
గీర్వాణభాషారత్నాకరమె. ౧౯౧౫ - సం.
ముద్రింపబ...



శ్రీసీతారామచంద్రపరబ్రహ్మణేనమః.



శ్రీమన్నెందడి
గదేశికులవారు.



శ్రీ ప్రపత్తి ఆంజనేయులు.



శ్రీఅచ్చమాంబవారు.



పెనుగొండ సీతయ్యగారు.



శా యమ్మగారు.



పెనుగొండ ముకుందదాసు.

శ్రీ ర స్తు.

# చందాదారుల నామధేయములు.

శ్రీదబ్బాకుపల్లె- శ్రీలక్ష్మీనారాయణ నివాసము తాలూకె నందిగామ

మహారాజశ్రీ.

వెచ్చా పెదలచ్చయ్యకొమారుడు శేషయ్యగారు

వెచ్చా రంగయ్య కొమారుడు కన్నయ్యగారు

వెచ్చా చినలచ్చయ్య కొమారుడు రామయ్యగారు

వెచ్చా నాగయ్యగారు

వెచ్చా పేరయ్యగారు

వెచ్చా సింహాద్రిగారు

యర్రా రాజయ్యగారు

ఖంమం తా॥ ఖంమం.

వంగవీటు వేదాద్రి

వ॥ రాఘవయ్యగారు

రాచర్ల రామయ్యగారు

సోమా చినకోటయ్యగారు

వెంనా నరిసింహాంగారు

ఆదారపు వెంకటరాయయ్యగారు

శీమకుర్తి రాజయ్యగారు

చౌడవరపు నరసింహాంగారు

శ్రీకాకోళ్ళపు రామయ్య

వ॥ అంతయ్యగారు

వడ్డెబోయిన అప్పన్న

చొప్పకట్లపాలెం

మిట్టకోల సీతారాముడు

చిరునోముల తా॥ ఖంమం.

మ॥రా॥ వేపచేదు వెంకట్రాం రావుగారు

శాఖమూరి నరసయ్యగారు

శాఖమూరి రామయ్యగారు

లింగాల నందిగామ తాలూకా

గుంటుపల్లి రంగనాయకులు గారు

గంగవెల్లి నందిగామ తాలూకా

మ-రా-రా-శ్రీ, కొమ్మరాజు లక్ష్మీరాయుడుగారు

జగ్గయ్యపేట నందిగామ తా॥

బాడుపాలెపు వెంకయ్యగారు

తమ్ముడు రామయ్యగారు

దబ్బాకుపల్లె నందిగామ తా॥

రాయపూడి వేదాద్రిగారు

రాయపూడి వెంకట్రా
గారు
చేడె శ్రీరాములు హాను
గా.
వెచ్చా నారయ్యగారు
బిళ్ళా చిదానందం
సందడి అప్పయ్యగారు
సందడి శ్రీరాములుగారు
చన్నా అప్పుడు విష్ణుసేవకుడు
వత్సవాయి తా॥ నందిగామ.
గుఱ్ఱం గురవయ్యగారు
భవనాశి గురవయ్యగారు
కోట పెంటయ్యగారు
బొగ్గవరపు నారాయణగారు
గుఱ్ఱం సుబ్బయ్యగారు
పెద్ది ముత్తయ్యగారు
ఉప్పుగండ్ల నర్సయ్యగారు
యక్కల శెట్టి నరసింహ్వాదాసు
దుగ్గి వెంకటగురవయ్యగారు
వేములనర్వ తా॥ నందిగామ.
చేడే అప్పయ్యకొమారుడు
నాగయ్యగారు
వాశిరెడ్డి వెంకటనర్సయ్యగారు
మేదరమెట్లు వెంకయ్యగారు
తోటచర్ల తా॥ నందిగామ.
కరువర్లపూడి సర్వయ్యగారు
శివాపురం తా॥ నందిగామ.
ఊట్లు లచ్మయ్యగారు

ఖంమం తా॥ ఖంమం.
తేరాల రామదాసుగారు
గ్రంధి రామదాసుగారు
రంగా పెద్దవెంకటలచ్చయ్య
గారు
నాళ్ళ క్రిష్ణయ్యగారు
కన్నెట్ల సుతారి మల్లయ్యగారు
కర్ణాటి నరసమ్మభక్తురాలు
పాతలింగాల తా॥ ఖంమం.
నాగుబండి పిచ్చమ్మగారు
కారెపల్లి తా॥ ఇల్లెందు.
పెరుమాళ్ళ గుర్వయ్యగారు
అనుమోలు బస్వమ్మగారు
ఇల్లెందు

మధిర తా॥ మధిర.

కట్టా వెంకట్రాయుడుగారు
మోటవర్రి తా॥ మధిర.
వెచ్చా కోటయ్యగారు
మారేపల్లి తా॥ తిరువూరు.
మ-రా-రా-శ్రీ॥ ఊటూకూరు
రామకృష్ణయ్య గ్రామమున
సవుగారు
గుఱ్ఱం జగ్గయ్యగారు
పోలిశెట్టిపాలెం తా॥
తిరువూరు.
మ-రా॥ ఊటూకూరు శేషయ్య
గారు

చాప్పకట్లపాలెం తా॥ ఖంమం.
మ-రా॥ ఏలూన్నాతల నరసిం
హారావుగారు
మిట్లపల్లి పట్టాభిరామయ్యగారు
అమ్మపాలెం బంజరతా॥
మానుకోట.
చీకటిమళ్ళ పకీరయ్యగారు
కంభంపాడు తా॥ తిరువూరు.
యలమర్తి రామయ్యగారు
కమతం వెంకయ్యగారు
కమతం పుల్లమ్మగారు
రామన్నపాలెం తాలూకా-
తిరువూరు.
సగ్గుర్తి రామయ్య కొమారుడు
నరసయ్యగారు.
కొంగర రామదాసయ్యగారు
కొంగర పెదవెంకయ్యగారు
కొంగర రామయ్యగారు
నన్నపనేని రంగయ్యగారు
వెల్ది పద్దయ్యగారు
వెల్ది ముత్తయ్యగారు
కుమెరబోయిన పరదేశి
రామభక్తుడు
కాకర్ల తా॥ తిరువూరు.
సగ్గుర్తి చినకోటయ్యగారు
సగ్గుర్తి వీరయ్యగారు
లక్ష్మీపురం తా॥ తిరువూరు.
బొల్లినేని రత్తయ్యగారు

ముత్తగూడెం తా॥ మధిర.
తిరుమణిశెట్టి వెంకటదాసు
తిరుమణిశెట్టి రామదాసు
తిరుమణిశెట్టి అప్పలదాసు
తిరుమణిశెట్టి వీరదాసు
బూస లక్ష్మణదాసు
గూడవెల్లి నరసింహదాసు
గూడవెల్లి అప్పలదాసు
గూడవెల్లి కోటప్పదాసు
బయ్యనగూడెం తా॥ మధిర.
ఉరియ్యారు రామచంద్రయ్య
గారు
దొంతు రామదాసు
చిల్లిపల్లి సుబ్బదాసు
పామర్తి నాయుడు విష్ణుభక్తుడు
పెంటాలవారిగూడెం తాలూకా
నందిగామ.
పసుమర్తి నరసయ్యగారు
ఇరుకుళ్ల గోపయ్యగారి కొమా
ళ్ళు పుల్లయ్య అప్పయ్య గార్లు
గోవిందాపురం తా॥ ఖమ్మం.
కేసా లచ్చయ్యగారు
కేసా గురవయ్యగారు
జవ్వాజి లచ్చయ్యగారు
యనుగంటి లక్ష్మాంబగారు
నందిగామతాలూకావత్సవాయి
ఇంగువ కృష్ణమూర్తిగారు
అద్దెపల్లి కోటయ్యగారు

పిరంగిపురం
బొమ్మకల్ రయిల్ష్టే
షరాబు- రామపూడి రం
శెట్టిగారు
విశ్వనాథపల్లి ఇల్లెందు
కోమ్యడ శ్రీరామదాసు

రామలింగాపురం బంజరు తా॥
ఇల్లెందు.
కంచర్ల అగయ్య బంజరుదారు
రామభక్తుడు
సింహాపురి తా॥ ఖంమం.
గుమ్మడవెల్లి లక్ష్మీపతి శెట్టిగారు

—✽ చందాదారుల ఫలాతిశయము. ✽—

కం॥ ఈపుణ్యాత్ముల నందర । మీపుణ్యము దెలుప తరమ నీక్షితి లోనన్ । ఆ పసులు మెచ్చ కీర్తిసీ । తాపత్రిలోచు మనల ధరసుత తోడన్॥ ౧॥

కం॥ పురివరదనీరంగోదా । వరిగల సిరియు యోగ్యమైన వదువునకడుదు । శ్చరితుంజైనను కావ్యాం । తరమున చెప్పబడి వావ నచరిత్రుడగున్॥ ౨॥

శ్రీసీతారాముల సహాయము.



శ్రీ ర స్తు.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః॥ ౧॥
గురుత్యాగీమహారోగీ మంత్రత్యాగీదరిద్రతః।
గురుమంత్రంద్వయంత్యాగీ రౌరవంనరకంవ్రజేత్॥ ౨॥
మద్భక్తాశ్శంకరద్వేషీ మద్వేషీశంకరప్రియః।
తావుభౌనరకంయాంతి యావచ్చంద్రదివాకరః॥ ౩॥
వాగ్దత్తంమనోదత్తం ధారాదత్తంతథైవచ।
తత్ద్రవ్యాపహారేణ చండాలఃకోటిజన్మసి॥ ౪॥
ఆహో రాఘవరాజేంద్రా సప్తకల్పానుజీవనం।
నశృణోమినపశ్యామి స్వయందత్తాపహారిణా॥ ౫॥
ఇంద్రందివ్యయకినమం రపూర్వముదధీం పంచాననంప
ద్మజం। అబ్ధిస్స్వాదుజలం శివంశితగళం కామంచస
ద్విగ్రహం। శైలాపక్షధరాంతదైవవచ హయాను
లక్ష్మీపతింపింగళం। జానేసర్వమిదంతునోరఘుపతే
దత్తాపహారాంమినః॥ ౬॥



## శ్రీమద్గురు రత్నములు.

కం॥ శ్రీగురుడసర్వసాక్షివి । శ్రీగురుడా సర్వమయుడ చిద్ఘన రూపా । శ్రీగురుడిహపరమైనా । శ్రీగురుడా నాగయార్యా శ్రితఫల వర్యా ॥ ౧ ॥ గురుడాఖ్యుడచ్యుతుండవు । గురుడా పరిపూర్ణ బోధ గుణరహితుండో । గురుడచలభావమయుడవు । గురుడా శ్రీనాగయార్య కోవిదవర్యా ॥ ౨ ॥ మాయారహితుడ వమలుడ । మాయాతీతాంతరాత్మ మయసర్వాత్మా । మాయకుడజ్ఞేయరూపుడ । బాయక శ్రీనాగయార్య భక్తాంతర్యా॥ ౩॥ భేద్యుడభేద్యుడభోద్యుడ । సాధ్యంబునుగాకనీవు సర్వంబైనా । నాద్యంతములేని బ్రహ్మ । విద్యవు శ్రీనాగయార్య వేదాంతార్యా॥ ౪॥ పరమాత్ముడ పరమేశుడ । పరమపదంధామసర్వ బ్రహ్మిద్వర్యా । హరిసర్వ మంత్రరూపా । ధరుడవు శ్రీనాగయార్య ధరయతివర్యా ॥ ౫ ॥ అయినవి.

## త్రిమూర్తి - త్రిశక్తి - స్తోత్రము.

కం॥ ముగురత్తలకోడలనా । ముగ్గురికిక తల్లివయ్యు ముదమును వదినై । ముగ్గురికిచెల్లెలైతివి । ముగ్గురికిక మంత్రరాజ మూలమువాణీ॥ ౧॥ మూర్తులముగ్గురితల్లివి । మూర్తులకున్భార్యలీవు మోదముబలమై । మూర్తులను బ్రోచుచుంటివి । మూర్తుల మూలంబు త్రిగుణ మూలము గిరిజా॥ ౨॥ తలితల్లిలోకమాతవు । సలలితముగ మ్రొక్కుచున్న సద్గతి కోరకుక । నిలనన్ను బ్రోతువనుచును । కలనైననుమరువకుంటి కమల జలక్ష్మీ॥ ౩॥ నాగాదిగమనుజనకుని । నాగాదిగమునుదండ్రి నాగము ముగురుక । నాగాదిగమన బ్రోవవ । బాగుగ నన్నేలుమింపుడు పరమాత్మహారీ ॥ ౪॥ శివశంకరభవహరహర । ధవళాంగ యోగిమునులతాపనివారా। నవపద్మనేత్రనినుమది । కువలయమునననమ్మినాను కోర్కె-

యుదీర్చున్ ॥ ౫ ॥ వారిజభవనీమృదుపద । వారిజములుదలతుకర్మ ప్రాలునుప్రాయన్ । ధీరుండశూరుడజగధా । ధారుడ నీమహిమదె లుప తరమానాకున్॥ ౬ ॥

ఈగ్రంథము- భక్తులు ముక్తులు రోగులు జ్ఞానులు పామరులు
సకలజనంబులకు నుపయోగమైయున్నది గనుక
చదువుకొని సారము గ్రహించగలరు.

---

శ్రీరస్తు.

శ్రీ గురుభ్యో నమః.

కం॥ ఫణివైరిగమనుదండ్రీ । ఫణిబంధువు సుతుడు నతను భక్తుడుయశుడున్ । మణిమంత్ర మొసగిబ్రోచిన । ఫణిశయ్యనుదలతునా దుభక్తిన్ శక్తిన్॥ ౧॥ ఏమీననతా జేతై । నాముందర కోలరాదు నర హరిపిన్నా। రామలముమ్మారంపితి । ప్రేమంబునబుద్ధిజెప్పి బిలువుము కలికీ॥ ౨ ॥ గీ॥ ఆలునొల్లకయున్నవా నమ్మమొగని । నందులోడాగియున్నవా నకట మొగని । నమ్మినాతనిజేరుచుదా నమ్మసవతి । కలిమిమాకిచ్చుటెప్పట్లవలశినట్లు॥ ౩ ॥ గుడ్డుపెద్దన్న దొరగన్న కొడుకు కన్న । పిన్నయాతనిపినతండ్రి పెద్దకొడుకు । ప్రభువుతమ్మునిచేనాజి పడినవాని। తండ్రితమ్మునిపట్టణ స్థలముజెవుమా ॥ ౪॥

కం॥ సతిపతిలిద్దరిపేరట । హితవుగనొకతరువుగలదు యీయచువిలోనన్ । స్థితిలేక నెవ్వడునానును। మతిమంతులుదీనిదెలువు మాసంబునతున్॥ ౫॥ చావామరుదులపేరట । భూవిభుడొకడేడుగలడు పృథివిస్థలిలో। భావించిదెలియజెప్పుడు । యేవిధమునసైనగాని నేడాదికియున్॥ ౬॥ చ॥ సలిలవిహారులిద్దరును సన్నుతకానన చారులిద్దరున్। చెలువుగవిప్రులిద్దరును జెందినకీర్తియు శూరులిద్దరున్ । పోలతులద్దాయుకువాడొకడు భూమికిబుట్టిన వాడొకండుయీ । పలువురుతోడబుట్టిన

కృపామతినాకుప్రసన్నమవ్వే ఉ॥ కన్యకునైదుపాదములు
కన్యకునారు కుచద్వయంబులున్ । ఘనాల్గుకన్నొమలు కన్యకుస
ప్తవిలోలనేత్రముల్ । కన్యకుద్వాదశ సెడి కారణమధ్యము గల్గినట్టి
యా। కన్యకునాకునేడుపది కావలెకస్తురిరంగనాయకా॥ ౮ ॥ ధీరుడు
వ్యాళ్ళజూచికడు ధీరతనొందిదృఢాంగచిత్తుడై । యూరువులందురాది
గచి యున్నతమైనకుచద్వయంబుపై । చీరతొలంగదీసికడు జేర్చిచనుం
గవల్చిగబట్టితా । కోరినకోర్కెదీర్చుకొనె కోమలిపొందక పామె
భూవరా॥ ౯॥ సీ॥ ఏనుగసింహంబు వేలనాగయునుగూడి నొకమాట
లోపల నుండవలయు । పక్షియావస్త్రంబు పాషాణమునుగూడి నొక
మాటలోపల నుండవలయు । ఫణిరాజుఫణివైరి ఫణిభూషణుడుగూడి
నొకమాటలోపల నుండవలయు । రారాజురతిరాజు రాజరాజును
గూడి నొకమాటలోపల నుండవలయు । దీని అర్థంబు దెలిసినా దేశిక
లకు। నెలలుపన్నెండుదినములు వెలమినిత్తు । జెప్పినాతడు భావాగ్ని
చక్రవర్తి । లక్షణోపేంద్రప్రభుడరాజాక్షితేంద్రా॥ ౧౦ ॥ విరాజరా
జపుత్రారి। తన్నామచతురక్షరం। పూర్వార్థంతవశత్రూణాం। పరా
ర్థంతవమస్తకే॥

ఉ॥ మకుటావశ్వానమాంసమును మద్యముబోసియు నీవువాం
డుచున్। చకటగపాదరక్షయును చయ్యనమూసితి వేమి మూఢయా।
దికుటకు దేవవిప్రగురు వృత్తులుముంచిన వారలొచ్చినన్ । ఘుటికటన
నీడదాకునని ఘుట్టిగమూసితి నేను భూవరా॥ ౧౨॥

చం॥ రమణిప్రియుండునీవి ఘని రంజులనామమదేమిటన్నయా।
కమనిజగంధిబల్లె కరికంధిప్రజాపతి చంద్రికాతప । త్రములు త్రివర్ణ
రూప్యముగ వ్రాసియునందులవధ్యరూపముల్ । క్రమముపఠింపగాను
గజ గామినినావిభునామమయ్యెడిన్॥ ౧౩॥

చందాదారుడు రామన్నపాలెం
సగ్గుర్తి పెదరామయ్యగారు.



శ్రీరస్తు.

శ్రీమద్గురుభ్యోనమః.

శ్రీసీతారామ పరబ్రహ్మణేనమః.

# బ్రహ్మజ్ఞానామృతసారము.



శా॥ శ్రీయచ్చాంబనునాగయార్యులను నే సేవించిభావించిహృ।
ద్గేయుంబందునపూజ జేసెదనుస - ద్దివ్యంబుగా భక్తినా।
కాయంబుఁ ధనమానసంబులుసహా గాధారబోసిప్పుడుఁ।
శ్రేయంబుఁగలబ్రహ్మజ్ఞానమృతముఁ శీఘ్రంబుగా జెప్పెదఁ॥

కం॥ రఘురాములభూపుత్రిని । యఘములుబోద్రోలిలెస్స యాత్మజ్ఞానా । సుఘమిచ్చిబ్రోవనిరతము । మఘువును రక్షించినట్టి మాధవుగొలుతుఁ॥ ౨॥

క॥ వెనుకటినిప్పటికవులను । మనమలరగ భక్తజనుల మానుల బుధులఁ । వినయమునజననిజనకుల । ఘనముగ పూజించి జెవుడు కవితమునివుడుఁ॥ ౩॥ క ॥ బలిపుండరీకశుకకపి । యలనారదయంబరీష యర్జునువ్యాసుఁ। డిలప్రహ్లాదవిభీషణు। బలురుక్మాంగదశౌనక పారాశర్యుఁ॥ ౪॥ క॥ శంకరనందనుదలచియు । పొంకముగా గ్రంథమిపుడు పూర్తియుజేయుఁ । నింకను శారదమృదుపద । పంకజములుగొలతు సుగణ పలుకులుబలుకన్॥ ౫ ॥ క॥ ఇలపెనుగొండవంశకుల । జలరాశిచంద్రుడైన చలమాఖ్యుడుతా । కులకాంతగసీతమ్మను । సలలితముగపెండ్లియాడి సంతతిగాంచెఁ॥ ౬॥ వారిరువురిసుగుణంబులు । నేరికి తరమాను దెలుప నింతనవశమా । ధీరుడుసుబ్బయసీతయు। నారమణికి

గల్గి రెట్టిదు నార్యులు మెచ్చఁగ॥ [illegible] తయు శాయాంబను । దాని
గవరియించి వైవాహికమాడి । శ్రీస [illegible] ంత్తమయును । దాసయ్యను
వరముతుండ దాసునిగనియెఁ॥ రా॥—— [illegible] త్రిముకుందాఖ్యుడు॥

కం॥ ఇప్పుడు చెప్పినగ్రంథము । తప్పొప్పులుగలవుమదిని దలఁచక
విబుడీ । తప్పొప్పుగలదభక్తికి । తప్పననదితప్పుగాద ధారుణిలోనఁ॥

మ॥ అపశబ్దంబులగూడియుఁ హరి చరిత్రాలాపముల్ సర్వపా।
పపరిత్యాగము సేయుగావునహరిఁ భావించుచుఁ బాడుచుఁ । జప
ముల్ సేయుచువీనులన్వినుచున శ్రాంతముఁ గీర్తించుచుఁ । దపసుల్
సాధులుధన్యులౌదురుగదా తత్వజ్ఞచింతింపుమా ॥ ౧౦॥

వ॥ ఎన్ని అపశబ్దంబులున్నను హరినామమువల్ల సర్వపాప
ములు బోవునని తెలియవలెను॥

మ॥ హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజ హంసా
వళీ। సురుచిభ్రాజితమైనమానస సరస్ఫూర్తిఁ వెలుంగొందుశ్రీ। హరి
నామస్తుతిలేనికావ్యము విచిత్రార్థాన్వితంబయ్యుశ్రీ । కరమైయుండద
యోగదుర్మతినటత్కాకోల గర్తాకృతిఁ ॥ అను పద్యానుసారముగ
హరిస్తుతితోకూడుకున్న కావ్యము బంగారపు తామరతీగెలతోను రత్న
ములతోను రాజహంసలతోను కూడుకున్న మానస సరోవరంవలె
ప్రకాశించుచున్నది. హరినామస్తుతిలేని కావ్యము విచిత్రార్థ చమ
త్కారములతో కూడుకొబడ్డదైనను లక్షణకరముగా ప్రకాశించదు.
మరెట్టులనిన మాలకాకులతో కూడుకున్న గుంటవలెనుగా నుండునని
భాగవతము॥

అని ఈప్రకారంబున ఇష్టదేవత ప్రార్థనంబును సద్గురువంద
నంబును సమస్తసత్కవివినుతియును సదాభక్తులసన్నుతియును సకల
సద్గుణసంపన్నులైన జ్ఞానులపూజయును బ్రహ్మానందమగ్నులైన వా
రిపాదసేవయును మిక్కిలి సుకవుల నామనోవాంఛదీర వేడుకొని
యును శ్రీసీతారామస్వామికి సమర్పితంబుగా నాయొనర్చుంబూనియు
న్నసమయంబున సకలసద్గుణసంపన్నుడును సాధనచతుష్టయ సంపత్తి
యును మిక్కిలిగలిగిన నొకభక్తుండు మత్సమీపమునకువచ్చి వినయ

విశేషయపూర్వకంబుగ వినుతించి నామనవిచిత్తగింపుండని ఇట్లనియె. ఓముకుందదాసాఖ్యా! ఈ భూమండలంబున సకల శాస్త్రములలో జెప్పబడియున్న దేమనగా బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసమని నాలుగాశ్రమములకు నాలుగుమార్గములు కర్మ భక్తి వైరాగ్యము జ్ఞానమని బలుకుచుండగ కొందరు బ్రహ్మజ్ఞానమని యందురు జ్ఞానమనగా నేమిటి? బ్రహ్మజ్ఞానమనగా నేమిటి? ఈ రెంటియందు గల తారతమ్యములు సవిస్తరంబుగా దెలిపి నన్ను తమశిష్యునిగాభావించి నాసకలసందేహములుదీర్చి నన్ను కృతార్థునిగా జేసి రక్షించుమని ప్రార్థింపగా నిటువంటి పరమపావనుడైన శిష్యునివిడచుటకన్న ప్రాణంబులిడుచుట మేలని భావించి దెలుపనారంభించితి॥

కం॥ ఇమ్మహిశిష్యునకిప్పుడు । సమ్మతిగా బ్రహ్మజ్ఞాన సారామృతము ■ । ఇమ్మగశ్రుతిస్మృతిపురా । ణమ్ములు ప్రశ్నోత్తరము ఘనంబుగజూపి॥

ఇప్పుడు నేనుజెప్పబోవుచున్న గ్రంథము వినువారిలో కొందరికి యిష్టమున్ను మరికొందరికవిష్టమున్ను గలుగును యందువల్లననిన షరీరశ్రేష్ఠమైనప్పటికిని కారకదేహములకు నారోగ్యముగా నుండును. వాతదేహములకు విరోధముగానుండును గనుక నేనుబట్టిన కుందేటికి మూడేకాళ్ళనియు నేనునమ్ముకున్నమార్గమే సత్యమని వాదించేటివారికందరికిని వికటముగానున్నను తతిమ్మ సత్పురుషు లందరును సమ్మతించి నిజమును దెలిసికొని బ్రహ్మానందమగ్నులై కడతేరుదురని యభిప్రాయముచేత జెప్పనుపక్రమించితి॥

—* గ్రంథమునకు ప్రారంభము. *—

శిష్యుడు అయ్యా గురుస్వామి జ్ఞానమనగానేమిటి అనిన శిష్యునకు గురుండుదెలుప నారంభించెను. ఛాత్రవర్యా వినుమనియె॥

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషుకశ్చిద్యతతిసిద్ధయే॥

భక్తిజ్ఞానము కలవారిలో వేయిమంది కొకడుమాత్రమే మోక్షమునకు ప్రయత్నించును. అటువంటి వేయిమందిలో నొకడు మోక్షమును బొందునని గీతాశాస్త్రములో భగవానువాక్యము॥

## —* జ్ఞానప్రశంస. *—

సీ॥ నామందిరంబిది నాసువర్ణంబిది నాతల్పమిదియని నరుడు
దాను । దన్మందిరసువర్ణతల్పంబులకువిలక్షణ సాక్షియైయవిగానిపగిది।
నాశరీరంబిది నాయింద్రియములివి నాప్రాణమిదియిది నామనంబు।
నాయహంకృతియిదినాబుద్ధియిదియని బహువిధదృశ్యరూపములనెల్ల।
నాయవియటంచు దెలిసి నిర్ణయముసేయు । నేనుదత్తచ్ఛరీరాది నిఖిల
వస్తు । సంఘమునకువిలక్షణ సాక్షినగుదు । గానియందెద్దియునుగాను
వానరేంద్రా॥

తా॥ ఇదినాయిల్లు ఇదినాధనము ఇదినాతల్పము ఇదినాభార్య॥
శ్లో॥ తల్పంశయ్యాట్టదారేషు॥ అని అమరము॥

ఇదినాదేహము ఇవినానేత్ర శ్రోత్రాదులు ఇది నాప్రాణవా
యువు ఇవినామనస్సుబుద్ధి చిత్తము ఇదినాగర్వము ఇదినాతెలివియని
నానావిధములైన నామరూపవిధములైన దృశ్యరూపములనెల్ల చూడ
బడు నాకారములనన్నిటిని తెలిసి నాసంబంధమైనవని యెరిగి నిశ్చయ
మును జేయుటయును నిఖిలవస్తుసమూహమును నేనుగానని నేనుయీ
దృశ్యములకు సాక్షిని అని యెరుగబడునంతయును జ్ఞానమని జెప్పు
దురు. అదియెట్లనిన అనిత్యమైనపనులలోనే ఇతనికి జ్ఞానము లేదనియు
తెలివిలేదనియు జెప్పినప్పటికిని తెలుసుకోలేడనియును అందురు గనుక
సామాన్యపనులే తెలియవని అన్నారుగాన సర్వము తెలుసుకునే తెలివే
జ్ఞానమనిసర్వత్రా జెప్పుకుందురు అనినగురునకు శిష్యుండు యిట్లనియె.

## —* బ్రహ్మజ్ఞానప్రశంస. *—

శిష్యుడు॥ గురుస్వామీ బ్రహ్మజ్ఞానమనగా నేమిటి అనిన శిష్యు
నకు గురుండు దెలుప నారంభించెను.

### మనుస్మృతి - ప్రథమాధ్యాయము.

మూ॥ యోసావతీంద్రియగ్రాహ్య స్సూక్ష్మోవ్యక్త స్సనా
తనః । సర్వభూతమయోచింత్య స్సయేవ స్వయము
ద్బభౌ॥

తా॥ అతీంద్రియగ్రాహ్యుడనగా ఇంద్రియముల నతిక్రమించిన మనస్సుచే గ్రహించదగినవాడు॥

శ్లో॥ నైవాసౌచక్షుషాగ్రాహ్యో నచశిష్టై రతీంద్రియైః।
మనసాతుప్రసన్నేన గృహ్యతే సూక్ష్మదర్శిభిః॥

తా॥ నేత్రముచేగాని తదితరేంద్రియములచేగాని గ్రహించబడక నిర్మలమగు మనస్సుచేతనే యతీంద్రియద్రష్టలచే నీబ్రహ్మము గ్రహించబడునని వ్యాసులచే జెప్పబడెను గావున మనోగ్రాహ్యుడును బహిరింద్రియముల కగోచరుడును నవయవరహితుడును నిత్యుండును సర్వభూతాత్ముండును గావున యిట్టిదట్టిదని దెలుప శక్యముగాని దేపరమాత్ముండో యతని తెలిసికొనుటె బ్రహ్మజ్ఞానమనియును ఇది యనుక గాక॥

మూ॥ యథాభావేనభవతి సర్వభావేననిస్పృహః।
తథాసుఖమవాప్నోతి ప్రత్యేహచశాశ్వతః॥

తా॥ ఎప్పుడు తత్వముచేత విషయములయందు దోషమని యెరిగి సర్వవిషయములయందు నిస్పృహుడగునో అప్పుడతడు మోక్షమును బొందునని తెలియవలెను॥

శ్రు॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ॥

తా॥ త్రికాలాబాధ్యము లేనట్టిదియును స్వయంప్రకాశము గలదియును దేశకాలానవచ్ఛిన్నము ఇట్టి లక్షణములుగలది బ్రహ్మము తైత్తిరీయోపనిషత్తు॥ భగవద్గీత ౧౩ వ అధ్యాయము॥

శ్లో॥ జ్ఞేయంయత్తత్ప్రవక్ష్యామి యజ్ఞాత్వామృతమశ్నుతే।
అనాదిమత్పరంబ్రహ్మ నసత్తన్నాసదుచ్యతే॥

తా॥ దేనినిపొందితే మోక్షము ఆవస్తువును తాననియును నదే బ్రహ్మమని తెలియవలెను. అహింస ఇంద్రియనిగ్రహము భూతదయ క్షమ మన్ననశాంతము తపస్సు ధ్యానము సత్యము ఈ అష్టదళములతో యెల్లప్పుడు ఆబ్రహ్మమును పూజసేయవలయును॥

కం॥ అజ్ఞానమెశూద్రత్వము।సుజ్ఞానమెబ్రాహ్మణుండు।శ్రుతులనువినరా। అజ్ఞానముడిగివాల్మికి। సుజ్ఞానపుబ్రాహ్మ

వామె చూడర వేమా॥— అను న్యాయానుసారముగ॥

శ్లో॥ దుర్లభంనరజన్మానాం సాధూనామతిదుర్లభం।
దుర్లభంవిష్ణుభక్తానాం జ్ఞానీత్రైలోక్యదుర్లభం॥

అను శాస్త్రానుసారముగ జ్ఞానులు మిక్కిలి లేరనియును, ఏవస్తువనువిచారించితే మళ్ళివిచారింపబడదో ఏవస్తువనుజూచితే మళ్ళిచూడబడదో ఏవస్తువనుపొందితే మళ్ళిపొందబడదో ఆవస్తువను తెలిసినవారే జ్ఞానులనియును ఆవస్తువే బ్రహ్మజ్ఞానమనియు అట్టివిచారదే మోక్షమనియు వారలే ముముక్షువులనియు బంధరహితులనియు జన్మకర్మరహితులనియు వారలే ముక్తులనియు సద్బ్రాహ్మణులనియు అట్టివారలే ఈమూడులోకములలో మిక్కిలిలేరని శృతిస్మృతేతిహాసపురాణములు ఘోషించుచున్నవనిన గురువును శిష్యుడు ఇట్లని ప్రార్థించెను.

## —* బ్రాహ్మణులప్రశంస. *

శ్రీగురుస్వామీ॥ బ్రాహ్మణులనగా నెవ్వరు? సద్బ్రాహ్మణులనగా నెవ్వరు? ఈరెంటియందు గల తారతమ్యంబులు దెలుపుమని ప్రార్థించిన శిష్యునకు గురుండు దెలుప నారంభించెను. అంతే వాసివర్యా వినుమనియె గురుండు॥

శ్రు॥ బ్రహ్మణిపరబ్రహ్మణి నిష్ఠావత్వాత్ బ్రాహ్మణః॥

పరబ్రహ్మమందు నిష్ఠగలవాడగనుక బ్రాహ్మణుడని జెప్పబడెనని, శ్రుతి॥

శ్లో॥ బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః॥

తా॥ అట్టిబ్రాహ్మణుండు సర్వావస్థలయందు అఖండ సచ్చిదానందస్వరూపుండైన పరబ్రహ్మమునందు అనంతానందాబ్ధియందు నోలలాడుచు అనగా తదేకనిష్టలో బాలోన్మత్తపిశాచమువలె జగము మరచి అనగా దేహభ్రాంతియు ఆశాపాశములు వదలియుండువారే బ్రాహ్మణులనియు అటువంటి వారలనే॥

శ్లో॥ బ్రాహ్మణోమమదేవతా ॥ అను భగవద్వాక్యము-అటువంటి బ్రహ్మజ్ఞానుల నేనని శ్రుతిస్మృతేతిహాసపురాణములు ఘోషిం

రుచున్నవనిన గురునకు శిష్యుడు ఆర్యవర్యా ఇటువంటివారు సద్బ్రా హ్మణులని బోధించితిరి. ఇక బ్రాహ్మణులనగా నెవ్వరనిన శిష్యునకు గురుండు జెప్ప దొడంగె. ఛాత్రవర్యా వినుమనియె॥

గురుడు॥ బ్రాహ్మణులనగా॥

మనుస్మృతి - ప్రథమాధ్యాయము.

మూ॥ అధ్యాపనంచాధ్యయనం యజనంయాజనంతథా।
దానంప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్॥

తా॥ బ్రాహ్మణోస్య ముఖమాసీత్ ॥ బ్రహ్మమందు బ్రాహ్మణులు ముఖమందు బుట్టినారని జెప్పరాదు మరేమనగా? ముఖమనగా వాక్కునకు అర్థము గనుక, బ్రాహ్మణులు వేదమును చదువడము చెప్పడము యజ్ఞమును జేయడము జేయించడము దానము నివ్వడము ప్రతిగ్రహించడము ఈయారును జేయుమని బ్రహ్మకల్పించెను. ఇందు వల్లనే షట్కర్మనిరతులనియును సత్యశీలులనియును నాశాపాశ రహితులనియును జెప్పబడును.

శ్లో॥ వేదపాఠంతువిప్రాణాం॥ అను ప్రమాణమునుబట్టి వీరలనే విప్రులని జెప్పబడును. వీరలనే బ్రాహ్మణులనివాడుకుందురు.

మూ॥ ప్రజానాంరక్షణందాన మిజ్యాధ్యయనమేవచ ।
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః॥

తా ॥ రాజులు యజనాదికర్మములలో ప్రతిగ్రహంబు దప్ప తక్కిన ఐదుకర్మలు జేయవచ్చును.

మూ॥ పశూనాంరక్షణందాన మిజ్యాధ్యయనమేవచ।
వణిక్పథంకుసీదంచ వైశ్యస్యకృషిమేవచ॥

తా॥ పశురక్షణము దానము యజ్ఞము అధ్యయనము క్రయ విక్రయములు వడ్డిబేరములు కృషియును నవియు వైశ్యులకు గల్పించబడెను.

మూ॥ ఏకమేవతుశూద్రస్య ప్రభుఃకర్మసమాదిశత్ ।
ఏతేషామేవవర్ణానాం శుశ్రూషామనసూయయా॥

తా॥ శూద్రునకు అసూయలేకుండ బ్రాహ్మణాది వర్ణత్రయ

మువారికి బనిజేయుటయొక్కొటిగనే నిర్మించెను. తమతమ ధర్మములు దప్పి వర్తించినయెడల నరకమునబడుదురనియును, శృతి॥

శిష్యుడు॥ గురుస్వామీ తమరు బోధించిన సద్బోధనంతయును ఇప్పుడు ఈప్రపంచములోనున్న బ్రాంహణులకేకదా వీరిలక్షణములు కొన్నిచిత్తగింపుడి యని మనవిజేసియు॥

ఆర్యవర్యా!

శ్లో॥ దశసూనసమశ్చక్రీ దశచక్రీసమోద్విజః ।
దశద్విజసమా వేశ్య దశవేశ్యాసమోనృపః॥

తా॥ పదిమంది జేసినంతపాపము నొకకుమ్మరి జేయును పది మందికుమ్మరులు జేసినంతదోషము నొకబ్రాహ్మణుడు జేయును పది మందిబ్రాహ్మణులు జేసినంతపాపము నొకవేశ్య జేయును అటువంటి భోగమవాండ్లు పదిమంది జేసినంతదోషము నొకరాజు యాచరించునని యు అట్టిరాజులు పదిమంది జేసినంత కిల్బిషము చెప్పడానికి తరముగా దనియును॥

శ్లో॥ రాజారాష్ట్రకృతంపాపం ॥ అను న్యాయమును॥

శ్లో॥ జపైర్మంత్రైశ్చహోమైశ్చ స్వాధ్యాయాధ్యాపనేనచ।
నావం వేదమయీంకృత్వా తారయంతితరంతిచ॥

తా॥ బ్రాహ్మణులు తమకాలమంతయు జపములచేత మంత్రయుక్తములగు హోమములచేత అధ్యయనముజేయుట జేయించుట వేదము నావగా జేసి ఇతరులను తరింపజేసి తాము తరింతురు గనుక బ్రాహ్మణులే దానమునకు పాత్రులనియు నితరులిట్టి వృత్తియందు సర్వదానుండరు గనుక దానమునకు పాత్రులు కారనియు జెప్పిరి. ఇప్పటిబ్రాహ్మణులు తమకాలమంతయు లోకోపకారమైన పనులువదలి లోకులందరికిని అపకారమే జేయుచుందురదెట్లనిన॥ ఇస్సేటు చీట్లాడుటయు కలహములులేని గ్రామములలో కలహములుపెట్టుచు కోర్టువ్యవహారములోదించి తాము సాక్ష్యము జెప్పుటకు మొదటివారలై దేశము నాశముజేయుటకు మిక్కిలిగడచేరినవారైయుందురు.

శ్లో॥ బ్రాహ్మణో యమఘాతుకా॥ అను న్యాయము సారముగా॥

గీ॥ శైలకుబుట్టి జెరచె కాకుస్తకులమెల్ల । సీతబుట్టి లంక జెరి
చినట్లు । విప్రజాతిబుట్టి విశ్వంబు జెరిచిరి । విశ్వదాభి
రామ వినర వేమ॥

అను న్యాయానుసారముగా తాము జేయకూడనవి కృషి వాణి
జ్యము నవుకరి మొదలుగాగల పనులు జేయుచుండుటయేగాక॥

శ్లో॥ వ్యాసవాక్యంమనుప్రోక్తం విప్రేసర్వత్రపూజయేత్ ।
కలౌపంచసహస్రాణి జాయతే విప్రసంకరః॥

అను పదమునకుమారుగా వర్ణసంకరమని జెప్పుదురు.

శ్లో॥ శూద్రాంశయనమారోప్య బ్రాహ్మణోయాత్యధోగతిం॥

తా॥ బ్రాహ్మణుడు శూద్రస్త్రీని తనశయ్యను జేర్చుకొనెనేని
యధోగతినొందును దానియందు సంతానమునుగనెనేని బ్రాహ్మణ్య
మువలన హీనుడగును ఇందుచే బ్రాహ్మణుడు శూద్రస్త్రీనిబొంది
నరకమునబడునని శూద్రాగమననిషేధము ఇప్పుడు సర్వదా పాప
మనివిచారించక కాపురంబులే జేయుదురుగాన వీరలకు వందనంబులు
జేయుటయు దానాదిక్రియలు జరిగించుటచూడగ॥

గీ॥ షండునకుబిడ్డనిచ్చిన చందమొందు । బూదిలోనెయ్యి
వేల్చిన పోల్కినోటి । కడవలోనీరు వెట్టిన కరణియ
గున । పాత్రజనులకు బెట్టుట పౌరవేంద్ర॥ అని భారతము.

గీ॥ పాపవర్తనుండు బ్రాహ్మణుడయ్యును । నిజముశూ
ద్రుకంటెనీచతముడు । సత్యశౌచధర్మ శాలిశూద్రుం
డైన । యతడె సద్విజుండు యనిరిమునులు॥

అను న్యాయానుసారముగా సత్యశౌచాచారములులేని వీరికి
దానములిచ్చుటకన్న మానుకొనుట మంచిదనిన శిష్యునకు గురుండు
శిష్యవర్యా వినుమనియె॥

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః ।
వేదపాఠంతువిప్రాణాం బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః॥

తా॥ జన్మమాత్రిన బ్రాహ్మణుడు శూద్రుడేనని యు పంచవయః
కర్మాణి అయిదు సంవత్సరంబులకు ఉపనయనాదికర్మములు జరిగిం

చుటవలన ద్విజుడనియు వేదముజెప్పుకొనుటవల్ల విప్రుడనియు బ్రహ్మ జ్ఞానమువలన బ్రాహ్మణుండనియు అట్టి బ్రాహ్మణుడే నాకు దైవము నని భగవద్వాక్యమునుబట్టి బ్రాహ్మణులని పూజింపవలయును వీరల నిందించకూడదు. పూర్వకాలంబున సత్యవంతులైన రాజులున్ను ధన వంతులైన వైశ్యులున్ను యజ్ఞయాగయోగములు జేయించి అనేక దానములివ్వగా బుచ్చుకొని సుఖజీవనములు జేయుచు నితరవృత్తికి బోక యజ్ఞయాగము సత్యశౌచాచారములుజరిగించుచు కామక్రోధము లుమాని వర్తించుచుండిరి. ఇప్పుడు సత్యవంతులైన రాజులున్ను ధన వంతులైన వైశ్యులున్ను నానాటికి క్షీణించుటవల్ల జీవనమునకు హాని వచ్చినందున కృషి వాణిజ్యము నవుకరిజేసి జీవింతురు షడ్రసోపేతము గా అన్నముదొరుకనప్పుడు అంబలిగాని గంజిగాని త్రాగి ప్రాణము లునిల్పుకొనుట మంచిదేకదా? లేక మంచిగాభోజనము దొరికినదనుక పస్తుబడియుండుటమంచిదా నీవేజెప్పుము. అందువల్లనే ఇతర కార్య ములు జేయుచు జీవించుట తప్పుగాదు ఇంతమాత్రముననే వీరల నిందిం పకూడదనిన గురునకుశిష్యుడు॥ శ్రీగురుస్వామీ- శిష్యుడు॥

శ్లో॥ సత్యంనాస్తితపోనాస్తి నాస్తిచేంద్రియ నిగ్రహః।
సర్వభూతదయానాస్తి ఏతచ్చాండాల లక్షణం॥
దూషకశ్చక్రియాశూన్యో నికృష్టోదీర్ఘకోపనః।
చత్వారఃకర్మచాండాల జాతిచాండాల ఉత్తమః॥

తా॥ సత్యశౌచాచారములు బొత్తిగాలేవుగదా యజ్ఞయాగా దికర్మములు మొదలేలేవుగదా దానధర్మములు శూన్యముగదా ఆశ పాతకులు ఉగ్రకోపులుగదా దయదాక్షిణ్యములు అనకూడదుగదా పుణ్యపాపములు గలవని జెప్పకూడదుగదా?

శ్లో॥ అధితౌతిష్టతిద్వారే ఆపోశృహ్ణంతుయోనరః।
ఆపోశనంసురాపానం అన్నంగోమాంసభక్షణం॥

శ్లో॥ మధ్యాహ్నేనధితి స్వయంవిష్ణుః॥

తా॥ అను న్యాయానుసారముగ భోజనవేళ్ళకు వచ్చిన అధి తికి అన్నోదకంబులిచ్చుట అనరాదుగదా॥

శ్లో॥ ఉత్తమం తక్షణే కోపంచ మధ్యమం ఘటికాద్వయం।
అధమం అహోరాత్రించ పాపిష్టీ మరణాంతకః॥
అను న్యాయానుసారముగ తమ జీవితకాలమంతయును కోపము విడువరుగదా?

శ్లో॥ అహం గచ్ఛతి మాతంగీ మధునాం మాంసభక్షిణీ।
కపాలంచ సురాయుక్తం ప్రోక్షనీయ్యం పదేపదే॥
తా॥ ఒక మాతంగిది తలపుర్రెలో కల్లుపోసుకొని తాను పోవుచున్న మార్గమునం దక్కడక్కడ చల్లుచుండగ సూర్యదేవుడుజూచి ఓచిన్నదాన నీవు కులహీనురాలవున్ను మధుమాంసములు భక్షించేదానవున్ను ఇదియునుంగాక నీవుయాడుదానవున్ను తలపుర్రెలో కల్లుబోసుకొని చల్లుకుంటూపోవుటయెందుకనిన, నది జెప్పునది యేమనగా॥

శ్లో॥ గోగ్రాసంగాగ్నిమదగ్ధంచ వృత్తిచ్ఛేదన మాతృకం।
కన్యావిక్రయ వేదాశ్చ యేతన్మార్గేన శుధ్యతాం॥
తా॥ గోవులమేత తగలబెట్టినవారున్ను ఇండ్లు కాలబెట్టినవారున్ను పరులజీవనములకు హానిదెచ్చిపెట్టినవారున్ను తల్లిదండ్రులపోషింపనివారున్ను ఆడపిల్లల అమ్ముకున్నవారున్ను వేదములు అమ్ముకున్నవారున్ను వేదములనగా ఇల్లుయిల్లుదిరిగి ప్రతిమనుజుని నీవు ఇంతవాడవు అంతవాడవని వేదశ్రుతులతో భూషించి కాసులు కొనుటయున్ను ఏకార్యములోచ్చిన ఖండితముగా డబ్బుపుచ్చుకుందురు అనగా పేదసాధులని విచారింపరుగదా? త్రికాలసంధ్యావందనములు మొదలంట తీసివేసియు॥

గీ॥ ఆటపాటలు పానంబు వెలదిపొందు ।
అను నీమాటితో రాత్రిందివములు వర్తించుచుండుటయు॥
శ్లో॥ శతబాలహత్యాన్వృతః॥
తా॥ నూరుమంది పసిబాలలజంపితే నెంతపాపమో ఒక్కపర్యాయము బద్ధమాడితే నంతపాపమని నీతిశాస్త్రముగనుక అటువంటి అబద్ధములు సదాకాలము మరువరుగదా?
సీ॥ ఎట్టిదుష్కర్మునీ ఏభారించెదగాని సత్యహీనుని మోవ

జాలనసుచు॥ గీ॥ బలుకదేతొల్లిభూదేవి బ్రహ్మతోడ॥

అను భాగవతమున్ను యిదియునుగాక సతతము అక్రమములే జరిగించుచుందు రదెట్లనిన వినుండీ॥ సచ్చిపోయినవారికి లేనిపోని దొక కర్మయనియు అందులో నిత్యకర్మయనియు సంవత్సరీకమనియు తద్దినమనియు పదిహేనురోజులు వెళ్ళువరకు సచ్చినవారు ఇంటివద్దను కర్తయందును స్మశానమునందును కనిపెట్టుకయుంటారని జెప్పుదురు నింకపక్షులయందు ముఖ్యముగా నుందురనిజెప్పి పక్షులకు అన్నోదకంబులు బెట్టింతురు॥

శ్లో॥ పక్షీనాంకాకిచండాల మృగచండాలగార్ధభః।
ఏతినాంకోపిచండాల సర్వచండాల దూషకః॥

తా॥ పక్షులనగా కాకులు గ్రద్దలు మలముదినే ఈపక్షులకు బెట్టుటవల్ల పితరులు నరకమునకుపోక స్వర్గమందు వుంటారని జెప్పుట చూడగా భ్రమపెట్టి కొంతసొమ్ము గుంజుకుందురు ఈమలముదినే పక్షులకు బెట్టుటవల్ల పితరులకు నరకమేకాని స్వర్గము రానేరదు. ఎందువల్లననిన మనము ఇంటివద్ద నొకవిస్తరిలో అన్నము వగైరాలు బెట్టి ఊరికిపోయినవారిపేరు జెప్పినమాత్రమున అతనికి యాకలితీరుటలేదు మనముబెట్టిన అన్నోదకములు బ్రతికినవారికే చెందనప్పుడు సచ్చినవారికి యట్లాముట్టునని నమ్మవచ్చును ఇదినొకతంత్రమే॥

ఉ॥ కండలునగ్నిదేవునకు కాలనవెముకలు భూమిదేవికిన్।
వండినకూడు కాకులకు వాతహిరణ్యము మాలవానికిన్। నిండుధనంబుభార్యకును నేర్పుతొ ప్రాణము దండధారికిన్ । వుండధనంబురాజునకు వచ్చునుమేలునుకీడు వెంబడిన్॥

అను న్యాయానుసారముగ తానుజేసిన పుణ్యాపాపంబులు వెంటవచ్చును వాటివల్ల స్వర్గనరకసుఖంబు లనుభవించుదురుగాని మరినొకతావున నుండకూడదుగదా యమదూతలు ప్రాణములనుదీసికొని పాపాత్ముల నాలుఘడియలకు పుణ్యాత్ములనాలుగుఘడియలకు తొంబదితొమ్మిదివై లామడదూరముగల యమపురికిదీసుకొని పోదురు. పా

పాత్రుల యిబ్బంది బెట్టుకుంటా బోవుటవల్ల అరుఘడియలని భాగవతము. ఇందువలన సచ్చిపోయినవారు పదిహేనురోజులు ఇంటియందున కర్తయందున పక్షులయందున ఉంటారని జెప్పుట ఇది వొకతంత్రమే ఇందువల్ల ఈబ్రాహ్మణులమాటలు నమ్మరాదు వీరలపూజింప కూడదనిన శిష్యునకు గురుండు ఇట్లని దెలుప నారంభించెను.

శిష్యవర్యా వినుమనియె॥ గురుండు॥ ఈబ్రాహ్మణులు పితర కర్మజేయించుట తప్పితమనకూడునా యెందువల్లననిన? అపుత్రస్యగతిర్నాస్తి॥ అను నొకప్రమాణము గనుక పుత్రులులేనివారికి గతులు లేవనియును అందువల్లనే మృకండమహాముని ని మునికన్యలు నీకు పుత్రులు లేరనియును నీయింట మంచినీరు త్రాగకూడదని వెళ్ళిపోయిరి గనుక పితరులకు కర్మలుజేయకపోయినట్లైతే నరకముతప్పదని జెప్పుటతప్పిదముకాదు॥ శ్లో॥ దుర్లభంనరజన్మానాం॥ అను న్యాయానుసారముగ ఈనరజన్మమైన దొరకదుగాన కర్మజేయుట తప్పుగాదు.

శ్లో॥ దూషకశ్చక్రియాశూన్యో నికృష్టో దీర్ఘకోపనః।
చత్వారఃకర్మచాండాల జాతిచండాల ఉత్తమః॥

తా॥ ఎల్లప్పుడు పరులదూషించువాడును అవశ్యకర్తవ్యంకర్మశూన్యుడును లోభివాడును మిక్కిలి కోపముకలవాడును ఈనలుగురు కర్మచాండాలురు వీరలకన్న జాతి చాండాలుడే శ్రేష్టుడని నీతిశాస్త్రము కాబట్టి వీరలకు జ్ఞానములేక తరించజాలరు గనుక కర్మమైనజేయకపోయిరేని కర్మభ్రష్టులైపోతారని కర్మజేయించుట నేరముకాదు. పితరులు యింటియందు కర్తయందు పక్షులయందు ధనుంజయవాయువవుందునని వేదశాస్త్రము యున్నది.

మంత్రము॥ ప్రేతరూప- శిల ఆవాహనం కరిష్యే । గృధ్రవా
యసముఖేన ప్రేతే సంజతా॥

అను న్యాయముచొప్పున పక్షులముఖమున అనగా పక్షుల ద్వారా కర్మజేయవలెననియును మలమదినే పక్షులన్నందుకు మలము లేనివారులేరుగదా? భగవంతుడు అన్నిజాతులలో వున్నాడు.

శ్లో॥ మత్తఃపరతరంనాన్య త్కించిదస్తిధనంజయ।
మయిసర్వమిదంప్రోతం సూత్రేమణిగణాఇవ॥

తా॥ ఓఅర్జునా ! నాకుసమానమైనదియు నాకన్న వేఱుకావమైనదియు కొంచెమైనలేదు నేను సమస్తప్రాణులలో పూసలలో గ్రుచ్చబడినదారము వతుగాయున్నానని అర్జునునకు జెప్పినభగవద్వాక్యముబట్టి ఈపక్షులయందువున్నాడని నమ్మవలయును. స్వామీ వారువరహావతారము నెత్తలేదా-నవి మలమునదినుట అందరికిసాక్ష్యమే కద మలమనగా బియ్యము పప్పువగైరాలు దుకాణములో వున్నప్పుడు సువాసనతోనుండియును ఈదేహములో బడినమాత్రమున మలమాయను నందువల్ల ఈదేహమేబనికిరానిదని దెలియవలెను. ఉశ్ఛ్వాసము నిశ్ఛ్వాసములద్వారా అందరుమలభక్షకులే తల్లిగర్భములోనున్నప్పుడు మలమూత్రములలోనే యున్నవారుగద? అందువల్ల ఈపక్షులద్వారా పెట్టిన అన్నోదకములు పరలోకమందున్న పితరులకు ముట్టును అందువల్ల కర్మజేయించుట తప్పుగాదు భగవంతుడు చరాచరంబులనిండియున్నవాడు ఈపక్షులలోలేడా? మమాత్మా సర్వభూతాత్మ॥ అను న్యాయానుసారముగ ఏతీరున భావించి(మ్రొక్కి)తే ఆవిధముగానే సిద్ధించును ఇంకా అనేక ప్రమాణములుకలవు గ్రంథవిస్తరభీతిచే నిందువ్రాయబడవనిన గురువునకు శిష్యుడు ॥

అయ్యా! శ్రీగురుస్వామీ తమరు బోధించిన న్యాయమునుబట్టి భగవంతుడు అందరియందు నొకవిధముగానే యున్నప్పుడు ఈబ్రాహ్మణులెక్కువేమి వీరల నెందుకు పూజింపవలయును ఇది నొక అపచారమేకద? యనినగురుడు శిష్యునితో వినుమని జెప్పనారంభించెను. ఇందుకు సమాధానము- గురుడు॥ బ్రాహ్మణో మమదేవతా ॥ అను భగవద్వాక్యము నుల్లంఘనముజేయుట తప్పుగాదా ? కలౌపంచసహస్రాణి జాయతేవిప్రసంకరః ॥ అను న్యాయానుసారముగ నానాటికి సత్యశౌచాచారములు మిక్కిలిలేవని వీరినిదూషింపరాదు యెందువల్లననిన॥

శ్లో॥ దూషకశ్చక్రియాహీనో ॥ అను న్యాయానుసారముగ

పరదూషణ చేయకూడదు బ్రాహ్మణదూషణ నింకా నిజమేకదా? ఇదియునుగాక బ్రాహ్మణులుదప్ప తతిమ్మ మూడుజాతులవారిచ ర్యలు వినుము తరువాత నీవే ఒప్పుకుందువు.

శ్లో॥ ఘాతకనఘాతకోవిప్రః క్షత్రియోరిపుఘాతుకః।
విశ్వాసఘాతకోవైశ్యః శూద్రఃసర్వస్యఘాతకః॥

తా॥ విప్రులు తమనుకొట్టినవారినైనను మళ్ళికొట్టరనియును రాజులు తమనుకొట్టినవారినిమళ్ళికొట్టుదురనియును వైశ్యులు కోపము రాకుండానుండియు పరులబాధింతురనియును శూద్రులు సర్వజనులను బాధింతురనియును జెప్పబడియెను. బ్రాహ్మణులనగా స్వబ్రాహ్మణు లనియు కర్మబ్రాహ్మణులనియు వేషబ్రాహ్మణులనియు, బ్రహ్మమును తెలిసినవారు స్వబ్రాహ్మణులనియు యజ్ఞయాగ జపతపపితురు కర్మ తర్పణం పాదప్రక్షాళన మొదలుగాగల కర్మలు జేయుటయు జేయిం చుటయు షట్కర్మనిరతులై యుండువారు కర్మబ్రాంహణులు వీరలే ఇప్పుడు సర్వజనులపూజనీయులై దేశమంతట వ్యాపించి యున్నారు. వేషబ్రాంహణులనగా వేషములువేసుకొని నాటకములు భాగవతము నాడుటయు వేట జూదము పానము ఇతర స్త్రీలలో కూడియుండడ ము కృషి వాణిజ్యము నవుకరి యాచన మొదలుగాగల పనులుజేయు వారు వేషబ్రాహ్మణులలో షరీకు॥

—* రాజులగుణములు వినుము. *—

శ్లో॥ రాజారాష్ట్రకృతంపాపం ॥ అను న్యాయాను సారము గా॥ శ్లో॥ మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః ॥ అను న్యాయ మెంతమాత్రమునులేక ధనకాంక్ష రాజ్యకాంక్షచేత పరుల సంహారించి వారిధనము నపహరించుటయు పరస్త్రీలనుకోరి భంగ పెట్టుటయు పరగ్రామములు దోచుకొనుటయు అన్నదమ్ముల తల్లిదం డ్రులవిషముబెట్టి చంపుదురు. యాటజూదంబు పానంబు వెలదిపొందు॥ లంచములుగొని కేసులు పాడుజేయడము న్యాయ మెంతమాత్రమును లేక అనేకదుష్కార్యములకు లోబడి ధర్మమునుదప్పి రాజగర్వము

చేత వర్తింతురు ఇంక అనేక విధములుగా ప్రవర్తించుటయును ఇది యనుటగాక॥

—* వైశ్యులధర్మంబులు వినుము. *—

శ్లో॥ వైశ్యోవిశ్వాసఘాతుకః॥ అను సామెతచొప్పున॥

సీ॥ మొదటపదివరహాల్ మోదంబుతోనిచ్చి వరహాకునొక
బేడ వడ్డిజేసి। ఉప్పిచ్చి పప్పిచ్చి నొనర ధాన్యంబిచ్చి
తవ్వనాగనిజెప్పి తప్పదనుచు। పంటలోవస్త్రము బా
కిదీర్చుమటంచు జెప్పినచొప్పునా చేవికెళ్ళ। పండిన
పంటయూ పశువులుమొదలుగా నంతగట్టినబాకి యు
సటమిగుల। నూరునిన్నూరుమున్నూరునొనర సేసి। బెట్టి
పిరియాదు సర్కారు బిలచినడిగి। ఇల్లువెడలించి యు
మ్మించి చల్లగాను। మెడలుకోతురు వైశ్యులూ మేలి
మిగను॥

తా॥ వైశ్యులు సర్వకాల సర్వావస్థలయందు అబద్ధములు బలుకుటయు అతియాశలనొందుటయు ఎక్కువ తక్కువ తూయుటయు కొలువుటయు మేనిరకములు కప్పించి వందలకొలది వుచ్చుకొని ఆడపిల్లల ముసలివాండ్లకు అమ్ముకొనుటయు ప్రతివిషయమందును ప్రమాణములు జేయుటయు బాకీలుమంచి దివాలుదీయుటయు గ్రంథములు విక్రయించుటయు స్నానసంధ్యాదికృత్యములు మానుకొనుటయు ధర్మమునుమొదలంట దీసివేయుటయు పేదసాధులయందును గురుదైవములందును భక్తిమానుటయు ఇంటికివచ్చిన అధితిని మెల్లగా సాగనంపి తమకు భోజనములుజేయుటయు మొదలుగాగల అనేకదుర్మార్గపనులు జేయుటయు ధనగర్వముచేత మాయంతవారులేరని విర్రవీగుచుందురు.

—* శూద్రుల సుగుణంబులు వినుము. *—

శ్లో॥ అహింసాపరమోధర్మమ్॥ అనున్యాయ మెంతమాత్రమును లేక వర్తింతురు.

సీ॥ దుడ్డుకర్రలుజూపి దొడ్డవారమమేము అడ్డమింతయు

లేదు హితముజేయ । బూనియున్నామని బూకరిం
చుచుమమ్మ దొరగారుయనవలెతోరముగను । బెదరిం
చినదలించి బింకాలుగొట్టుచు వాడువీడనిబిలువ పరస
బెట్టి । బాకీలుముంచుచూ బాగభక్షించుచు తాగుచు
జీవులా తరుచుజంప । కోపమునకును బుట్టిల్లు కొదు
వలేదు । సత్యమింతయుగనరాదు నిశ్చయముగ । వీరి
సుగుణంబులును దెల్ప విధికివశమే । న్యాయమును లేదు
నంత యన్యాయమరయ॥

శ్లో॥ శూద్రః సర్వస్యఘాతుకః॥

తా॥ మాయంతవారు లేరనియును మేమే శ్రేష్టులమనియును మమ్మదొరగారు అనవలయుననియును అట్లు అనకుంటిరా మిమ్మల యేమిజేసెదమో చూడుడయును ఇతరులందరిని ఏమోయి రావోయి పోవోయి వాడును వీడును అని బిలుచుటయును రాజసము శౌర్యము కోపములునుజూపి ప్రజలను దండించడమును అబద్ధము లాడుటయును బాకీలుముంచుడమును తప్పసాక్ష్యములుబలుకుటయును దేవగురుబ్రాహ్మణుల మామూళ్ళు ముంచ్చడమును పరదూషణ పరనింద పరుల వంచించడమునకు నాలోచించడమును అదలించి బెదరించుడమును బింకాలు గొట్టుడమును ఇంకా అనేక సుగుణంబులతో నున్నవారు ఈనాల్గవజాతివారుగదా? మధుమాంసంబులకు మొదటివారుగాన నివి యునుగాక ఇంక అనేకములు గలవు. ఈత్రిజాతులవారి చర్యలు నీతిరుగానుంచుకొని మేమేయెక్కువయని బ్రాహ్మణుల దూషింప మొద లుబెట్టిరి ఇందుకు తీర్పు.

శ్లో॥ కలౌపంచసహస్రాణి జాయతే వర్ణసంకరః॥

అను న్యాయమును బట్టి విచారింపగా బ్రాహ్మణులు సత్యశౌచాచారములు వదలుటయును ఆడపిల్లల అమ్మకొనుటయును కృషి వాణిజ్యము నవుకరిజేయుడమును ఇంకా నీచవృత్తులతో ప్రవర్తించుడమును, తతిమ్మ త్రిజాతులవారందరును దాన ధర్మ సత్యములులేక ఇంకా అనేకదుష్కార్యములలో ప్రవర్తించి వర్తించుటయును ఇవి

యున్నియును వర్ణసంకరమాహాత్మ్యమని తెలియుచున్నది గాన ఈసత్యశీలురైన కర్మబ్రాహ్మణులకు దుర్మార్గవృత్తులు గల ఈక్షత్రియజాతులను గంతకుదగినబొంతయని అన్నలాగున ఈ బ్రాహ్మణులను పూజింపవలయును మీరు శ్రేష్ఠులైయుండియును బ్రాహ్మణుల దూషింపవచ్చునుగాని అన్యాయముగా దూషింపరాదు ఇందుకు॥

శ్లో॥ దూషకశ్చక్రియాశూన్యో॥ అను న్యాయానుసారముగా॥

గీ॥ తప్పులెన్నువారు తండోపతండముల్ । నుర్విజనులకెల్లనుండుతప్పు । తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు ।
విశ్వదాభిరామ వినరవేమా॥

అను న్యాయానుసారముగా అన్యాయముగా పరులదూషించి వారిదోషమును మీరుపొందుటకన్న మానుకొని కాలానుగుణ్యముగా ఈబ్రాహ్మణుల పూజించుచు వీరలకే సమస్తదానము లిచ్చుచును సర్వేత్రా వీరలుచెప్పినట్టుగావర్తించుట యుక్తమని బుధజనాభిప్రాయము ఇదేనా నిశ్చయము.

—* యజ్ఞముల ప్రకరణ ప్రశంస. *—

శిష్యుడు॥ ఆర్యవర్యా! నామనవి చిత్తగించుడీ.

శ్లో॥ అహింసాపరమోధర్మం॥ బను న్యాయమెంతమాత్రమును లేక యజ్ఞ యాగములందున పశువులజంపుట పాపము కాదా?

గీ॥ కటికివానికైన కాళ్ళుమ్రొక్కఁగవచ్చు । సోమయాజిముఖము చూడరాదు । బ్రహ్మనెరుగువాడు పశువులచంపునా । విశ్వదాభిరామ వినరవేమా॥

అను న్యాయానుసారముగ॥

శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవే తరోజనః॥

తా॥ శ్రేష్ఠుడేకార్యమును జేయుచున్నాడో ఇతరులు ఆకార్యమునే జేయుదురు అని గీతాశాస్త్రము. అనిన శిష్యునకు గురుండు ఛాత్రవర్యా వినుమనిరి గురుడు.

శ్లో॥ లోకనాసంగ్రహమేవాపి । సంపశ్యంకర్తుమర్హసి॥

తా॥ లోకసంగ్రహణార్థమై కర్మము జేయువలయునని గీత

చార్యులే చెప్పియుండగా యజ్ఞయాగములు జేయుట తప్పుగాదు. ఎందువల్లననిన జీవహింస నైనప్పటికిని యజ్ఞయాగములు జేయుటవల్ల స్వర్గభోగములుకల్గును. గనుక జీవహింసవల్ల పాపము స్వల్పమున్ను పుణ్యమాధిక్యమని జ్ఞానహీనులు యజ్ఞయాగములు స్వర్గసుఖమును గోరి యాచరింతురుగాన ఇదియుక్తమైనదే యెందుకనగ అజ్ఞానులైన పామరులు సదా జీవులజంపుటయు కల్లుసారాయి త్రాగి నరకమున బడుటకన్న ఇదియుక్తమైనదే? దేవపిత్రతిథి పూజావిధులం దిడిమరి నంజుపురుషుడమాంసభోజీ॥ అని భారతము శాంతిపర్వములో జెప్పినదని తెలియవలెను. ఇదిజ్ఞానమునకు జెప్పినదికాదు అజ్ఞానసమంధులకు వేదమేపలికినది యెందువల్లననిన, కర్మభక్తిజ్ఞానములవల్ల అందరిని మోక్షప్రాప్తులజేతునని శ్రుతిప్రమాణము॥

—* మనుస్మృతి. *—

మూ॥ తపఃపరంకృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే।
ద్వాపరేయజ్ఞమేవాహు ర్దానమేకం కలౌయుగే॥

తా॥ కృతయుగమందు తపంబును త్రేతాయుగమం దాత్మజ్ఞానంబును ద్వాపరయుగమందు యజ్ఞంబును కలియుగమందు కేవల దానంబును ప్రధానములు తపము మొదలగునవి నాలుగు అన్నియుగములయందును జేయదగినవేమైనను ఫలాతిశయంబును గలదని ప్రత్యేకంబిట్లుజెప్పబడియె. ఇప్పుడీకలియుగంబునందు దానధర్మంబులు బొత్తిగామాని వర్తించుచుండిరిగాన నధోగతికి మూలకారణమాయెను.

—* స్త్రీల ప్రశంస. *—

శ్లో॥ మత్తేభకుంభదళనే భువిసంతిధీరాః । కేచిత్ప్రచండ
మృగరాజవధేపిదక్షాః । కింతుబ్రవీమిబలినాం పురతః
ప్రసహ్యకందర్పదర్పదళనే విరళామనుష్యాః॥

తా॥ మదించిన యేనుగుల కుంభములనుజీల్చిన ధీరులును కోపోద్రేకముచే మండుచుండు సింహములను హతముజేసెటి ధీరులును కలరుగాని జ్ఞానబలముతో స్త్రీలనేత్రబాణములనే మన్మథోద్రేకమును తెగటార్చిన శూరులు తరుచుగా లేరనియును విశ్వామిత్ర పరాశర

ప్రభృతులే చెడిరనగ నరులనెంతవారని భర్తృహరి వచనము.

మూ॥ వైవాహికోవిధిస్స్త్రీణాం సంస్కారో వైదికస్మృతః।
పతిసేవాగురౌవాసో గృహార్థోగ్నిపరిక్రియా॥

తా॥ స్త్రీలకు వివాహసంస్కారమే ఉపనయన స్థానీయము గృహకృత్యమే అగ్ని పరిచర్యయనగా సాయంప్రాతస్సమిద్ధోమము గాన వివాహాదికమే ఉపనయనస్థానీయమని మన్వాదులు చెప్పుటవలన స్త్రీలకు ఉపనయనాదికములేకుండెను అని మనుస్మృతి॥

## యజ్ఞములు.

శ్లో॥ దైవమేవాపరేయజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరేయజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥

తా॥ కర్మయోగులు ఇంద్రవరుణాది దేవతలనుద్దేశించి జేయబడుయజ్ఞములు చిత్తశుద్ధికొరకు చేయుచున్నారు. అట్టి యజ్ఞములను అదివరకు జేసియుండుటచేత చిత్తశుద్ధిబొందినయతులు నిర్విశేష పరబ్రహ్మమనియెడు అగ్నియందు బుద్ధ్యాద్యుపాధులతో కూడుకొనినవాడును ఆకలి మొదలుగాగల సకల సంసార ధర్మములు కలవాడును అజ్ఞానజీవుని నిరుపాధికమైన యాత్మచేతనే హోమమును చేయుచున్నారు అనగా సోపాధికుండైన జీవునకును నిరుపాధికుండైన పరమాత్మకును భేదములేదని తెలిసికొని సోపాధికుండైనజీవుని నిరుపాధికబ్రహ్మమనియెడు నగ్నియందు హోమమును జేయుచున్నారని తాత్పర్యము.

కర్మయజ్ఞమనగా? చిత్తశుద్ధికొరకు ఇంద్ర వరుణాది దేవతలనుద్దేశించి చేయంబడు దర్శ పూర్ణమాసాది మొదలుగా గల యజ్ఞములను జేయుచున్నారని నెరుగవలయును. పౌండరీకం పశుహింసాది మొదలుగా గల యజ్ఞములుగరవుట ఇట్టి యజ్ఞములు పాపరూపమైనప్పటికిని ఇందుకు ఫలితార్థము స్వర్గాదిభోగములు కలుగును.

శ్లో॥ క్షీణేపుణ్యేమర్త్యలోకంవిశంతి॥ అనగా తానుజేసినయజ్ఞయాగ వ్రజ జప తప దాన శౌచాచారంబులరాబడిన పుణ్యమువలన రంభాదిభోగములను అనుభవించి మరల నాపుణ్యముతీరగానే భూలో

కమున ధనవంతులు సత్యవంతులు రోగులు రాజులైనవారి యిండ్ల లో జన్మించి భక్తిజ్ఞానములు గలవాడాయెనేని మోక్షమునకుబోవును లేదా యజ్ఞయాగాదికర్మలు జేసెనేని స్వర్గమునకు పోవును లేక పాపకృత్యములు జేసినట్లైతే నధోలోకమునకు పోవునుగాన పాపకార్యములు ఎప్పటికిని జేయకూడదు గనుక తెలిసినవారు జ్ఞానయజ్ఞములనే నాచరింతురు వినుము.

శిష్యుడు॥ అయ్యా గురుస్వామీ జ్ఞానయజ్ఞమనగా నేమిటి? యజ్ఞములెన్నివిధములు. గురుడు ఛాత్రవర్యా వినుము.

శ్లో॥ యజ్ఞదానతపఃకర్మా నత్యాజ్యం కార్యమేవతత్।
యజ్ఞోదానంతపశ్చైవా పావనాని మనీషిణాం॥
ఏతన్యాపితుకర్మాణి సంగంత్యక్త్వా ఫలానిచ।
కర్తవ్యానీతిమేపార్థా నిశ్చితంమతముత్తమం॥ అనుగీతము.

తా॥ యజ్ఞదాన తపస్సులనెడి పనులువిడువదగిన యవికావు. అవశ్యముగా జేయదగినయవి బుద్ధిగలవారలై నాచరించువారికి శుద్ధి కరములు వీనిని జేయునపుడు॥

శ్లో॥ కర్తాభోక్తా జనార్దనః ॥ అను న్యాయాను సారముగా అంతాబ్రహ్మమే అనగా తాను జేయుచున్న యజ్ఞము అగ్ని నెయ్యి తానుపెట్టినవాడు తినువాడు నంతయును భగవంతుడేయని నమ్మికొని సంగమును ఫలాపేక్షను విడువవలయును ఇదియేనా నిశ్చయము యజ్ఞదాన తపస్సులను నవియే ఋణత్రయ విమోచకము లగు బ్రహ్మచర్యము యజ్ఞము ప్రజోత్పత్తి బ్రహ్మచర్యమన్నను తపస్సన్నను నొకటియే బ్రహ్మచర్యనియమములనే తపస్సని జెప్పుదురు. నియమేషుతపశ్శబ్దః॥ ఆపస్తంబ ధర్మసూత్రము. అని ధర్మశాస్త్రకారులు జెప్పియున్నారు- ప్రజోత్పత్తియనునది దానరూపము తండ్రియే తనయుడుగాబుట్టునని శాస్త్రము జెప్పుచున్నది తండ్రియొక్క యంగములసారమగు వీర్యమే తనయుడు దనదేహసారముగనుక బిడ్డలనుగలిగించుట ఇదియొకదానమైయున్నది. ఇటులనే ఉపనయన సంస్కారము యాగముసేయించుటచేతను ద్విజత్వము విద్యా యాగసంతాన

ముల అభివృద్ధిపఱచుటయును దానరూపమగు ఈ నాల్గువిధములసం తానములునని సూత్రకారు లుదహరించియున్నవారలు॥ యానుత్పా దయతే। యానుపనయతే। యానధ్యాపనయతే। యఃకాయాజయతే। ఇతిసర్వాస్సైన్యప్రజాభవతి ॥ బోధాయన గృహపరిభాషా సూ త్రము॥

తా॥ ఏకర్మలను విడిచినను యజ్ఞ దాన తపస్సులనుమాత్ర ము ఈమూడు కర్మములు నియతమైనవి గనుక ఇవి విడిచినవాడు మూఢుడు॥

శ్లో॥ నియతస్యతుసన్యాసః కర్మణోనోపపద్యతే।
మోహాత్తస్యపరిత్యాగః తామసఃపరికీర్తితః॥

తా॥ అని శ్రీకృష్ణభగవానులు సెలవొసంగియున్నవారు- బుద్ధి శాలియగు నతడు నేనుసేయుచున్నాడను నాపనియిది దీనిఫలము నాకు రాదగినదియను భావనవిడిచి ఈశ్వరుండు సంకల్పించియుండు సం సారచక్రగతు కనుకూలముగా నేనుజేయదగినపని యిదియని జేయు ను. ఇట్లుజేయుచు సంగమును ఫలాపేక్షయును లేక జేయునతడు సా త్వికమగు త్యాగమని తాత్పర్యము.

శ్రు॥ యజ్ఞోవైవిష్ణుః॥ తా॥ యజ్ఞము వాస్తవముగ విష్ణువుయని శృతిప్రమాణానుసారముగా యజ్ఞశబ్దవాచ్యుడును సోపాధికుండును యైనఈశ్వరునితోగూడ అనగా ఈయిరువురుని బ్రహ్మవేత్తలు బ్రహ్మా గ్నియందు హోమమునుజేయుచున్నారని అనగా తరంగ బుద్బుదము లు తరంగ బుద్బుదాకారములను పోగొట్టినయెడల ఆధారమైన సము ద్రముకంటె వేరుగానట్లు ఉపాధిధర్మములను విడిచినయెడల జీవేశ్వ రులిద్దరును అధిష్టానభూతుండును తురీయుండును నిర్విశేషుండును నైన పరమాత్మముకంటె వేరుగాదని తెలిసికొనుచున్నారని యెరుం వలయును॥ శ్రీధరీయము॥ జ్ఞానమునకు సాధనములైన అనేకయజ్ఞము లను ఈశ్లోకముమొదలుకొని యెనిమిది శ్లోకములచేత తెలియజేయు చున్నాడని యెఱుగవలయును.

శ్లో॥ శ్రోత్రాదీనింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి।

శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషుజుహ్వతి॥

తా॥ ఓ అర్జునుడా! కొందరగు నైష్ఠిక బ్రహ్మచారులు చెవులు మొదలుగాగల ఇంద్రియములను నియమములనియెడు నగ్నులయందు హోమమును చేయుచున్నారు అనగా ఇంద్రియములనునిగ్రహించి నియమమే ప్రధానముగా గలవారైయున్నారనిభావము. మరియును మరికొందరు గృహస్థులు శబ్దముమొదలుగాగల విషయములను ఇంద్రియములనియెడు నగ్నులయందు హోమమును జేయుచున్నారు. అనగా, ఉత్తములయిన గృహస్థులు విషయములను అనుభవించెడు కాలమునందుగూడా విరుద్ధములగు విషయములనువదలి అవిరుద్ధములయిన విషయములను గ్రహించుచున్నారని తాత్ప॥

శ్లో॥ సర్వాణీంద్రియకర్మాణీ ప్రాణకర్మాణిచాపరే।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతిజ్ఞానదీపితే॥

తా॥ ఓఅర్జునా! మరికొందరు సమస్తమునైన జ్ఞానేంద్రియములయొక్కయు కర్మేంద్రియములయొక్కయు ప్రాణాపాన వ్యానోదాన సమానములనియెడు ప్రాణవాయువులయొక్కయు నాగకూర్మకృకర దేవదత్త ధనంజయములనునట్టి యుపవాయువులయొక్కయు కర్మములను చమురుచేతను అనగా ఆత్మజ్ఞానముచేత ప్రజ్వలింపంజేయబడిన ఆత్మయందు మనస్సును నిరోధించుటయే స్వరూపముగాగలయోగమనియెడు అగ్నియందు హోమమును జేయుచున్నారనితా॥

శాంకరీయము ॥ తా ॥ ఇంద్రియములయొక్క కర్మములను శ్రవణమననాదులను వివేకవిజ్ఞానముచేత ప్రజ్వలింపంబడిన ఆత్మసంయమాది యగ్నియందు ధ్యానధారణాసమాధులే స్వరూపముగాగల అగ్నియందు హోమమును చేయుచున్నారనియు సకల వ్యాపారములనువదలి ఆత్మయందు చిత్తసమాధానమును జేయుచున్నారని తెలియవలయును. ఇంక అనేకమార్గములుగల యజ్ఞములున్నవని యెరుగవలయుననిన గురునకు శిష్యుడు గురుస్వామీ ॥ యని మనవిజేయ నారంభించెను.

శిష్యుడు॥ శ్రీగురుసార్వభౌమా॥— శిష్యుడు॥ ముద్రలుబట్టలేని

వాడు నిద్రబోతనియును యోగములు దెలియనివానికి భోగములులేవ నియును మహిమలు దెలియనివాడు వ్యర్థుడనియును అని కొందరందురు గాన వాటియొక్క ప్రభావములు దెలిపి నన్ను మన్నింపవలెనని ప్రార్థించిన శిష్యునకు గురుండు యంతేవాసీ వినుమనియె॥

—* పంచముద్రల ప్రశంస. *—

పాట॥ ముద్రలెన్నియుబట్టినా - యాయాసమునకు కారణమె కానీ- చిమ్రావుగననేర్తురాలేదహా ॥- శ్రీరామరామా॥ అను శ్రీరామ శతకము॥ న్యాయానుసారముగా ముద్రలు బట్టుటవల్ల దుఃఖకరములే గాని సుఖకరములైన సద్గతిపొందజాలరు.

౧ ఖేచరి ౨ భూచరి ౩ మధ్యలక్ష్యము ౪ షణ్ముఖి ౫ శాంభవి ఈదైదును పంచముద్రలనబడును. ౧ ఖేచరి కనులుమూశియయినను తెరచియయినను భ్రూమధ్యమందు దృష్టినిల్పిజూచుట ఖేచరీయనబడును. ౨ భూచరి నేత్రములు గదలింపక నాశికాగ్రమున దృష్టినిల్పి చూచుటయును, ౩ మధ్యలక్ష్యమనగా, నాశికామధ్యమందు దృష్టి నిల్పి అంతర్లక్ష్యమందు మనస్సునిల్పిచూచుటయును॥ షణ్ముఖి యనగా నేత్రరంధ్రములు రెండు శ్రోత్రరంధ్రములు రెండు నాసారంధ్రములు రెండుకూడ ఈ ఆరురంధ్రములుమూశి భ్రూమధ్యమున దృష్టినిల్పి చూచుటయును, ౫ శాంభవియనగా అంతర్లక్ష్యము బాహ్యదృష్టి యుగలిగి మనోమారుతంబుల వికారంబు లుడిగించుట శాంభవిముద్ర యనబడును. ఈపంచముద్రలు తెలిసిన శ్రీగురుముఖముగా నెరిగి పిమ్మట శాంభవిముద్ర స్థిరపరుచుకొనుటయే యిందుకు ఫలమని తెలియవలయును.

—* యోగచతుష్టయ ప్రశంస. *—

మ॥ ఘనతం దారక సాంఖ్యయోగములచే గష్టింపగా నేల నె। మ్మనముంబట్టగనేలయింద్రియముల్ మర్దింపగానేలచ । కన్నగాముంగటగానుపించు ఘటముల్ గన్నట్లు బ్రహ్మంబుగా । దనుదాగాంచినయంతలోనిఖిలముం దానై వెలుంగుందగున్ ॥

అని సీతారామాంజనేయములో అంతరాత్ముడైన శ్రీరాములవారు అంజనేయునకు బోధించినదేమనగా? తారకసాంఖ్య యోగముల్బట్టి కష్టపడుటెందుకు తనముందరనున్న కుండవతుగా బ్రహ్మము గనుపించుచుండగా యోగములుబట్టి ప్రయాస నొందుటయే కాని అందువల్ల కడతేరడనియును॥

కం॥ తనుతాగాననిమనుజుని । మననునిరోధింపబడక మస
లుచుదిరుగుక్ । దనుదాగను సత్పురుషుని । మనమా
నందాబ్ధియందు మగ్నతనొందుక్॥

తా॥ అనిజెప్పిన న్యాయమును వదలిపెట్టి మేమే ఘనులమని యోగములుబట్టి గర్వమును జెంది మంచివారిని నిందింతురు. గానయోగములయందు దుఃఖకరములేగాని సుఖకరములులేవని తెలియవలెను.

౧ మంత్రయోగము ౨ లయయోగము ౩ హఠయోగము ౪ రాజయోగము.

౧ మంత్రయోగము స్వభావనియత రేచక పూరక కుంభక క్రమంబుచేత ఏకవింశతి సహస్రషట్శతాధిక సంఖ్యా జప మంత్రానుష్ఠానంబు మంత్రయోగ మనంబడును.

౨ లయయోగము ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిల సంయమన పూర్వకంబుగా ప్రాణవృత్తియందపానంబును నపాన వృత్తియందు ప్రాణంబు లయంబు గావించుట లయయోగ మనంబడును.

౩ హఠయోగమనగా మూలబంధోడ్యాణబంధ జాలంధర బంధ పూర్వకంబుగా రేచక పూరకంబుల నుడిగించి ప్రాణాపానంబులరెంటిని రేయుంబవ లోకక్రమంబున కుంభించుట హఠయోగమనంబడును.

మరియును, ఈహఠయోగము ధర్మప్రభువు పాలించు రాజ్యమందలి పుణ్యనదీతీరమందు శాస్త్రోక్త క్రమముగా హఠయోగ మఠము గట్టించుకొని యోగమందున నిపుణుడైన గురునిడగ్గర నుంచుకొని వారిచేత నిర్ణయింపబడినప్రకారముగా పథ్యములునుజేయుచు భోజ

నాభ్యంజనాదులచేత శరీర రక్షణము జేయుచు గుదాది కుంచనము చేత నీళ్లుపీల్చి అధోమలములనుకడిగి విడుచుచు కల్పవృతములచేతను గండూషాదులచేతను వక్షస్థల కంఠగత కఫ పిత్తాదులను గ్రక్కుచు అంజన నశ్యాదులచేత కపాలనాళికలయందలి దుష్టజల మలాదులను విసర్జించుచు శీతకాలమందు ఉష్ణమును ఉష్ణకాలమందు శీతమునుగలుగజేయు పవిత్రమైనభస్మమును శరీరమంతటను పూయుచు సాత్వికాహారాదుల భుజించుచు కాయశుద్ధియు గురుదేవతాభక్తియుగల్గి పరిశుద్ధాంతఃకరణుడై మితాహార నిద్రాహార జాగ్రతులుగలవాడై స్థిరాసనుడునై మూలబంధ ఒడ్యాణబంధ జాలంధర బంధంబులతోడ పూరకాది శీతల కేవలాద్యష్టవిధ కుంభకములచేత ప్రాణవాయు నిరోధనముజేసి కాయసిద్ధిని సంపాదించి ఆకాశగమన దూరదృష్టి దూరశ్రవణ ఘటికా పాదుకాసిద్ధులను అణిమాద్యష్టసిద్ధులను స్వేచ్ఛాచరణాదులను సంపాదించియుండుట హఠయోగమనంబడును.

౪ రాజయోగమనగా లక్ష్యత్రయయుక్తంబై తారకసాంఖ్యామనస్కాత్మకంబై యొప్పునది రాజయోగమనంబడును. ఎరియును గురువులవలన వేదాంతశాస్త్రవిషయములను పలుమారును శ్రవణము చేసి మనననిధిధ్యాసములు గావించి వైరాగ్యోపశాంతి వివేకవృత్తులుగలిగి సదాపరబ్రహ్మాపరోక్షవృత్తిచేత జీవన్ముక్తినిబొంది విదేహముక్తిపర్యంతము ప్రారబ్ధమనుభవించుచుండుట జ్ఞానయోగమనంబడు నిదియే రాజయోగమనియునుం జెప్పబడును.

—* అష్టాంగయోగముల ప్రశంస. *—

శ్లో॥ మీనస్నానరతః ఫణిః పవన భృకుమేషశ్చ పర్ణాశనః।
శార్దూలో వనమధ్యగః ప్రతిదినం శేతేబిలేమూషకః।
భస్మోద్ధూళితవిగ్రహః ఖలుఖగో ధ్యానాదిరూఢో
బకః । కింతేషాంతపనఃఫలం భగవతోభక్తిప్రధానం
తపః॥

అను న్యాయానుసారముగా॥

ఉ॥ ఎందరుతాపసుల్ జెడిరి యెందరుకర్మఠులట్టె భ్రష్టులై।

రెందరుమానులుంబడిరి యెందరుయోగులు జోగులైరి
గా । విందుని పాదపద్మములు విడనిభక్తి భజింపనే
రకా। చందమునొందకీవు మనసాహరిపాదము లాశ్ర
యింపుమా॥

అను న్యాయానుసారముగా యెన్నియోగములుబట్టినను భక్తి
జ్ఞానముకన్న మోక్షము లేదని నమ్మవలయును. యోగములుబట్టి అనేక
మంది చపలులై చెడిపోయినారు గనుక యోగములవల్ల దుఃఖమేనిశ్చ
యమని తెలియుడీ.

౧ యమము ౨ నియమము ౩ ఆసనము ౪ ప్రాణాయామ
ము ౫ ప్రత్యాహారము ౬ ధ్యానము ౭ ధారణ ౮ సమాధి ఈయెని
మిదిన్ని అష్టాంగయోగము లనబడును. వీనిలో మొదటినాల్గును పూ
ర్వాంగములనిన్ని తక్కిననాలుగు ఉత్తరాంగములనిన్ని చెప్పబడును.

౧ అహింస ౨ సత్యము ౩ ఆస్తేయము ౪ బ్రహ్మచర్య౫అప
రిగ్రహము ౬ ఓర్పు ౭ మితభోజనము ౮ సర్వజనప్రియత్వము ఈలా
న్ని యమమనంబడు అందు ౧ అహింసా ఈరు - పేను- నల్లి- ఈగ
చీమ లోనగు స్వల్పజంతువులను క్రూరములైన పాములు తేళ్ళు
మొదలగు విషజంతువులను భీకరములైన శరభములు సింహములు
యేనుగులు పులులు అడవిపందులు మొదలగు మృగములను చంపకుం
డుటయును యజ్ఞములయందు పశువులజంపుటయు ఈరెండు అహిం
సాయనంబడును.

౨ సత్యము యున్నసంగతి యున్నట్టుగను చూచినసంగతిచూ
చినట్టుగను విన్నసంగతి విన్నట్టుగను తప్పక జెప్పుటయును ఒకనికి సం
భవించిన ఆపద దప్పించుటకు నాడిన కల్లమాటయును సత్యమేనని
చెప్పబడును.

౩ ఆస్తేయమనగ యెట్టికష్టకాలమందైనను పరులసొమ్మునప
హరింప మనస్సున దలచక అపహరింపుమని నోటజెప్పక చేతముట్ట
కయుండుటే ఆస్తేయమనంబడును.

౪ బ్రహ్మచర్యము స్త్రీసంపర్కంబు మరణించుదనుకనైనను

బుతుకాలములయందు నిజభార్యనుగలసి తనివి నొందుచున్న నయినను బ్రహ్మచర్యమనంబడును.

౫ అపరిగ్రహము ధనధాన్యాదులను దానపూర్వకంబుగా నెవ్వరునిచ్చినను పుచ్చుకొనకుండుటయును సత్కృతముగా శిష్యులిచ్చినయెడల పుచ్చుకొనుటయు నీరెండున్ను అపరిగ్రహ మనంబడును.

౬ ఓర్పు మేలువచ్చినప్పుడు సంతోషమును కీడువచ్చినప్పుడు వ్యధయును లేక సుఖదుఃఖములకు క్షమించుట ఓర్పుయనంబడును.

౭ మితభోజనము లేదని యెవ్వరినినడుగక రాదాయెనని చింతింపక పరులచే రాబడినయెడల వద్దని విసర్జింపక ఆయాసములేక యుండునట్లు యుక్తముగా భుజియించుట మితభోజన మనంబడును.

౮ సర్వజనప్రియత్వము ఒకరికి తానువెరువక తాను నొకరిని వెరపింపక సర్వభూతదయ గలిగియుండుట సర్వజనప్రియత్వ మనంబడును.

—* ఆసనముల ప్రశంస. *—

౧ వీరాసనము ౨ స్వస్తికాసనము ౩ పద్మాసనము ౪ యోగాసనము ౫ కూర్మాసనము ౬ భద్రాసనము ౭ సిద్ధాసనము ౮ కుక్కుటాసనము ఇవిమొదలైన యెనుబదినాలుగాసనములని తెలియవలెను.

—* అష్టసిద్ధుల ప్రశంస. *—

౧ అణిమ ౨ మహిమ ౩ గరిమ ౪ లఘిమ ౫ ప్రాప్తి ౬ ప్రాకామ్యము ౭ ఈశ్వరత్వము ౮ శివత్వము ఈ ౮ న్ని అష్టసిద్ధులని చెప్పబడును.

౧ అణిమయనగా అణుప్రమాణములైన ప్రాణులయందు పరమాణుప్రమాణుడై యుండుట అణిమయనంబడును.

౨ మహిమయనగా బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివ విరాట్పురుషాండములకంటె పెద్దవాడైయుండుట మహిమయనంబడును.

౩ గరిమయనగా బ్రహ్మాద్యండములకంటె భారమైయుండుట గరిమయనంబడును.

౪ లఘిమయనగా మేరువంతటి బరువుగలిగియుండి దూదిలేశ మువలె తేలికైయుండుట లఘిమ యనంబడును.

౫ ప్రాప్తియనగా ఇష్టమైనపదార్థములను లభింపజేసికొనుట ప్రాప్తి యనంబడును.

౬ ప్రాకామ్యమనగా గగనగమనాదిసిద్ధి ప్రాకామ్య మనంబడును.

౭ ఈశ్వరత్వమనగా సూర్య చంద్ర మహేంద్ర ఉపేంద్ర అగ్ని ప్రముఖదేవతులను పనులలోనియమించుట ఈశ్వరత్వ మనంబడును.

౮ శివత్వమనగా సకలజంతువులను వశము జేసుకొనుట - శివత్వమనంబడును. ఇంకా జల స్తంభన అగ్ని స్తంభన మారణమొదలుగా గల అనేకమహాత్తులు గలుగును. వీటివలన గర్వము అహంకారము మొదలుగా వికారములు గల్గినందున అనేకజన్మములకు కారణములవునని తెలియుటే ఈవిచారమునకు ఫలం.

—* తత్వజ్ఞానకందార్థములు. *—

బ్రాహ్మణులనగా సువిలో। బ్రహ్మంబునుగనినవారె బ్రాహ్మణులుసుమీ। బ్రహ్మంబునుగననేరని। బ్రాహ్మణులా మానేటివారూ। బ్రాహ్మణులేనా॥ బ్రహ్మముగనినా- వారే- బ్రాహ్మణులూ॥ బ్రహ్మయజ్ఞాది కర్మములు జేయుచుపర - బ్రహ్మను గనలేని పామారులంచారు బ్రాహ్మణులేనా - బ్రహ్మముగనినా-వారే బ్రాహ్మణులూ॥౧॥

అరుణోదయకాలంబున। సరగున నదికేగిస్నాన సంధ్యాదివిధుల్। నెరవేర్తురాత్మతీర్థము। పరువడిసేవింపకున్నా బ్రాహ్మణులేనా। బ్రహ్మముగనిన వారేబ్రాహ్మణులూ॥ సరయోగపదియూ రకురమూలుగలమంత్ర- మరయనెరుకై యున్నదనుచు మెరుగనివారూ- బ్రాహ్మణులేనా - బ్రహ్మముగనిన వారేబ్రాహ్మణులూ॥ ౨॥

హృదయంబును బ్రహ్మండము। తుదనున్నయెలుగుకంటె తోలివెలుగిదెత్వం। పదమిదెతత్పదమిదెఅశి। పదమిదెయని దెలియకున్నా॥ బ్రాహ్మణులేనా బ్రహ్మముగనినా వారేబ్రాహ్మణులూ॥ పది

రెండక్షరములాలు బట్టబయలైయున్న - సదనుూల ముం తార్థసారమె
రుగనివారూ॥ బ్రాహ్మణులేనా - బ్రహ్మముగనిన వారే - బ్రాహ్మ
ణులూ॥ ౩॥

దేహాల సంబులోపల । దేహిఅనేదేవుడుండి తెపకుసోహం।
సోహంబనుచును బలికేటి । రహస్యము తెలియకున్నా - బ్రాహ్మణు
లేనా- బహ్మముగనినా వారే బ్రాహ్మణులు॥ దేహమందిట్టున్న దే
వునిగనలేక - బాహ్యపూజ చేసి భ్రమలనొందెటివారూ - బ్రా
హ్మణులేనా బ్రాహ్మణులె బహ్మవేత్తలెవరైనా॥ ౪॥

క్రతువులుతపమును జపమును । వ్రతములు నుపవాసములను
వర్తింపుచునుస । గతిదేవయను పరమాత్మను । ప్రతినిమిషము జూడ
కున్నా బ్రాహ్మణులేనా - బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులూ॥
మతినిశ్చయముగ జన్మములేనిదెరుగాక - గతులున్నవనియేటి మతిహీ
నులందాహూ॥ బాహ్మణులేనా - బ్రహ్మముగనిన వారే - బ్రాహ్మ
ణులూ॥ ౫॥

అష్టాంగయోగసాధన । నిష్టలువర్తిల్లుకొన్ని నియమంబులువి।
స్పష్టము దెలియనేరక । భ్రష్టులతెరమానవారూ । బ్రాహ్మణులేనా-
బ్రహ్మముగనిన- వారే బ్రాహ్మణులు॥ యిష్టమైనట్టుగా యిలనువర్తిం
చాక- స్రీష్టాలమనుచుపర - శివునిగాననివారూ ॥ బ్రాహ్మణులేనా-
బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులూ॥ ౬॥

కాకులవలెనీటమునిగియు । ఆకలికినోర్వలేక ఆకులలంబుల్।
మేకలవలెభక్షించుచు । ప్రాకటముగ దివినినున్నా - బ్రాహ్మణులే
నా। బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులూ॥ ఆకారరహితమౌ యా
త్మనుగనలేక - చీకాకుపడుచూను- చింతనొందెటివారూ॥ బ్రాహ్మ
ణులేనా- బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులూ॥ ౭॥

భ్రూయుగ్మవిజృంభణమన । గాయిదె బ్రహ్మాపదమంచు ఘను
లెరుగుదురన। సాయుజ్యపదవినొందవు। పాయంబును దెలియకున్నా-
బ్రాహ్మణులేనా। బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులూ ॥ మాయా
లోజికీర్తియు మన్మ మెరుగగలేక - కాయసిద్ధికిచొట్లు గలుగుననియేటి

వారా- బ్రాహ్మణులేనా- బ్రహ్మముగనిన వారే బ్రాహ్మణులు॥౮॥

—* పంచకోశ ప్రశంస. *—

యంతేవాసి వినుమనియె గురుండు॥

శ్లో॥ కింరూపాః పంచకోశాస్స్యుః కోవాతద్వ్యతిరిక్తతా।
ఆత్మనశ్చేతితత్సర్వం సదృష్టాంతంవిచార్యతే॥

తా॥ ఆత్మ పంచకోశవ్యతిరిక్తుడని శ్రుతులు చెప్పుచున్నవి. గనుక పంచకోశముల నెరుంగకనే పంచకోశవ్యతిరిక్తమైన యాత్మనెరుగకూడదు గాన ముందు పంచభూతములును పంచకోశస్వరూపమును విచారింపవలె. అదియెటువలెనంటే॥

—* పంచభూతములవివరము. *—

ఆకాశము ౧ వాయువ ౨ అగ్ని ౩ జలము ౪ భూమి ౫ ఈఅయిదున్ను పంచభూతములు ౫ జ్ఞానేంద్రియంబులు ౫ కర్మేంద్రియంబులు ౫ ప్రాణాదులు ౫ మనస్సు ౧ బుద్ధి ౧ చిత్తము ౧ అహంకారము ౧ ఇవిఅన్నియునుగూడి ౨౪ ఇరువదినాలుగును కూడినదే దేహము ఇరువదైదవది జీవుడు ఇరువదారవదే ప్రత్యగాత్మ ఇరువదేడవదె పరమాత్మయని తెలియవలెను.

పంచకోశములనగా? అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములని యైదువిధములు వీనియందన్నమయకోశమనగా అన్నమువలన జన్యమై స్తంభమువలెస్థూలమై కరచరణాద్యవయవాకారమై షడ్భావవికారమై షట్కోశాత్మకమైయుండునట్టి స్థూలశరీరము అన్నమయకోశము॥ ౧॥ ప్రాణమయకోశమనగా? పదిఅవయవములతో కూడుకొనియున్నది కర్మేంద్రియంబులైదును పంచప్రాణములైదును ఈపదియునుగూడి ప్రాణమయకోశమాయెను॥ ౨॥ మనోమయకోశమనగా? ఆరవయవములతో గూడుకొనియుండునది ఆరవయవములు నెవ్వియనిన, మనస్సును జ్ఞానేంద్రియంబులైదునుకూడి మనోమయకోశమాయెను ॥ ౩ ॥ విజ్ఞానమయకోశమనగా? బుద్ధియును శబ్దాదివిషయ పంచకంబునుగూడి విజ్ఞానమయకోశమనంబడు జ్ఞానేంద్రియ పంచకంబును బుద్ధియునుంగూడినవిజ్ఞాన

మయకోశమనంబడును॥ ౪॥ ఆనందమయము- ప్రియమోద ప్రమోద వృత్తిమత్తై అజ్ఞానప్రదమైన అంతఃకరణము ఆనందమయకోశమనంబడును ॥ ౫ ॥ ఈవిచారమునకు ఫలంబేమనిన ఆత్మ అవస్థాత్రయంబునందు ననుస్యూతమైయున్నది. పంచకోశంబులవస్థాత్రయంబులం దెందును అనుస్యూతములయియుండలేదు కాబట్టి వ్యావృత్తములయిన పంచకోశములుతోచుచు వ్యవహారంబునకు వచ్చినప్పటికిని ఈపంచకోశములు ఆత్మవ్యతిరిక్తముగా లేవనుటయే ఈవిచారమునకు ఫలమని తెలియవలెను.

కం॥ సారాసారంబెరుగని । భీరులకుఁ బుద్ధిచెప్ప పెద్దలవశమా । నీరెంతబోసి పెంచిన। కూరౌనా సేలవేమి గువ్వలచన్నా॥

అజ్ఞానులకు నెంతబోధించినను తమ మతమును మానరని తెలియవలెను.

సీ॥ మహనీయకలితాన్న మయకోశ మగునాత్మ డనిపలుకుదురుకొంద రజ్ఞులగుచు । నుహితేంద్రియప్రాణమయకోశమగునాత్మ డనిపలుకుదురుకొంద రజ్ఞులగుచు। మానితవిజ్ఞాన మయకోశమగునాత్మ డనిపలుకుదురుకొందరజ్ఞులగుచు । మంజులతరమనో మయకోశమగునాత్మ డనిపలుకుదురుకొందరజ్ఞులగుచు । సుప్తియందేమిదోపనీ శూన్యతత్వ । మాత్ముడనిపలుకుదురుకొందరజ్ఞులగుచు । గూఢి నానందమయకోశ రూపుడగుమ । హాత్ముడనిపలుకుదురుకొంద రజ్ఞులగుచు॥

తా॥ ఓయి ఆంజనేయా! కొందరు అజ్ఞానులు పూద్యతమైన అన్నమయకోశమే పరబ్రహ్మమని చెప్పుదురు. కొంతమంది అవివేకులై ప్రాణమయకోశమే పరమాత్ముడగునని వచింతురు. ఇంకకొందరు వివేకహీనులై మనోమయకోశమే సచ్చిదానంద స్వరూపుండని వచియింతురు. మరికొందరు మూఢులై విజ్ఞానమయకోశమే పరమాత్ముడగునని పలుకుదురు. నందులో కొంతమంది తెలివిలేనివారలై

నిద్రయందు యేమియుగోచరింపని శూన్యరూపమే పరిపూర్ణమని చెప్పుదురు. ఇంకా కొందరు జ్ఞానహీనులై సత్యముగా ఆనందమయ కోశమే పరబ్రహ్మస్వరూపుండని పలుకుదురని తెలియవలెను.

చ॥ గురుదుహిరణ్యగర్భుడని కొందరు గొందరిల న్మహావి
రా। ట్పురుషుడటంచుకొందరు ఋభుప్రభుడంచు ము
కుందుడంచుగొం। దరుశివుడంచుగొందరు వినాయకు
డంచును గొందరుబరా। పరవరు నన్నెఱుంగక యు
పాస్తియొనర్చుదు రజ్ఞులై తెగన్॥

తా॥ ఈభూమియందు కొందరు సచ్చిదానంద నిత్య నిర్మలుడైన నన్ను నెరుగజాలక బృహస్పతియనియును చతుర్ముఖ బ్రహ్మమనియును సమష్టివిగ్రహ స్వరూపుడనియును ఇంద్రుడనియును విష్ణువనియును సాంబమూర్తియనియును బుద్ధదేవుడనియును లేక విఘ్నేశ్వరుండనియును గరుడనియును ఈప్రకారంబుగా శాశ్వత బ్రహ్మమైన నన్ను దెలియనేరక అనేకమందనేకమార్గంబులన్ నన్నారాధింతురని శ్రీరాములవాక్యము.

తే॥ ఆదిమధ్యాంతశూన్యమై నట్టిప్రకృతి। ఆదిమధ్యాంతములుగల్గి నట్లతోచి। ఆదిమధ్యాంత రహితాద్వయాత్మునకును। నాదిమధ్యాంతములుగల్గ నాపరించె॥

తా॥ ఆది అంత్యములులేని పరాత్పరునకు ప్రకృతనే మాయ ఆదినంచములు గలిగించెనని తాత్పర్యము.

ఇదియునుంగాక కొందరు అక్షియే బ్రహ్మమనియు మరికొందరుబుద్ధియే పరబ్రహ్మమందురు ఇంకాకొందరు నాభాసుడే పరమాత్ముడందురు నందులోకొందరు దేహాత్మయే బ్రహ్మమందురు ఇంకా తెలివిహీనులు ఆనందమే బరాత్పరుడనియును సోహమే బ్రహ్మమనియును అనేకమం దనేకవిధములుగా జెప్పుకొందురు. అంజనేయా! అని శ్రీరాముడు సీతారామాంజనేయములో బలికెనని తెలియవలెను.

శిష్యుడు॥ శ్రీగురుస్వామీ ! ఆనందమనగా ఎన్నివిధములనిన? శిష్యునకు గురుండు ఛాత్రవర్యా వినుమనియె.

—* ఏకోత్తర శతగుణాధికానందప్రశంస. *—

తనయొక్క ఆనందమనేడి ప్రళయకాలసముద్రమందు సార్వభౌముండైన చక్రవర్తియొక్కయు ౧ మనుష్యలోకమందు శ్రేష్ఠుడైన మనుష్యులలో మనుష్యగంధర్వుని యొక్కయు ౨ దేవగంధర్వునియొక్కయు ౩ ద్వివిధములైన పితృదేవతలయొక్కయు ౪ అనగా ఆజానుజాన దేవతలయొక్కయు ౫ అగ్నిష్వాత్తాది దేవతలయొక్కయు ౬ ఇంద్రునియొక్కయు ౭ చతుర్ముఖునియొక్కయు ౮ విరాట్పురుషుడైన తటస్థేశ్వరుని యొక్కయు ౯ హిరణ్యగర్భుని యొక్కయు ౧౦ కర్మదేవతలయొక్కయు ౧౧ దేవతలయొక్కయు ఈ ౧౨ ను ఆనందములు. నురుగులు నీటిచినుకులు నీటిబుగ్గలు అలలు మొదలైనభేదములుగానుపుట్టుచు వృద్ధిబొందుచు అణగుచుండును. పదునొకండు ఆనందములు తైత్తిరీయోపనిషత్తునందు అని వేదమందు చెప్పియుండగా పండ్రెండని యేల చెప్పబడెననగా, తైత్తిరీయోపనిషత్తునందు విరాట్‌హిరణ్యగర్భులనిద్దర నొక్కనిగానే బల్కబడెను. మనుష్యానందము మొదలుకొని హిరణ్యగర్భానందము వరకుగల ఆనందములన్నియు జ్ఞానియొక్క ఆనందబిందువులే వారిదేహములుగా భావించవలయును. ఈపదునొకండు కామ్యానందములు పదునొకండు తెరంగులుగానున్నవి. ఏకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించి భోగించునది మనుష్యానందము. ఈకల్పమందు పుణ్యకర్మఫలమువలన గంధర్వలోకమునుపొందిన మనుష్యగంధర్వునియొక్క ఆనందమునకన్న ఒకటొకటి నూరుభాగములుగా ఆనందములున్నవని దెలియవలెను ఈచెప్పబడిన పదునొకండు ఆనందములు మనోవాక్కులకు అందినవి అవాఙ్మానసగోచరంబైనది బ్రహ్మానందము అట్టి ఆనందసాగరంబున మగ్నుడైన బ్రహ్మజ్ఞాని రాగాదివిషయములతో సంబంధించియుండు పైజెప్పిన ఏకాదశానందములను శునకము క్రక్కిన అశనము వలె భావించి వానియందు ఇచ్ఛలేక ఆభోగములన్నిటిని ఇంద్రజాలములుగా నెంచుటవలనను వానినన్నింటికి అన్నిభోగస్వరూపములుగానుండి భోగించువాడే తానేగదాయను అనుసంధానముచేతను వానిలెల్లను అనుభ

వించువారలవలె సకల భోగములను పొందినవాడనిభావము. కాబట్టి అపరోక్షజ్ఞానముచేత బ్రహ్మమునుపొందవలయు. ప్రపంచజ్ఞప్తి విడచినవాడు పరబ్రహ్మమేయగును. అట్టివానిని తామరాకుపై నీళ్ళవలె ఆగామికర్మములంటనందుచేత నిష్టయందుంచిన తూలమురీతిని సంచితకర్మముదగ్ధమైపోవుచున్నదని యెరుగవలయును తరువాత॥

— * కర్మాకర్మముల ప్రశంస. * —

శ్లో॥ కర్మణ్యకర్మయః పశ్యే దకర్మణిచకర్మయః।
సబుద్ధిమాన్మనుష్యేషు సయుక్తః కృత్స్నకర్మకృత్॥

తా॥ ఓ అర్జునుడా! ఏపురుషుడు వ్యాపార మాత్రమునందు కర్తృభావమునుచూచునో కర్తృభావమునం దకర్మమును చూచునో అట్టిపురుషుడు మనుష్యులందు బుద్ధిమంతుండును సకల కార్యములను చేసినవాడును యోగియును అగునని గీతాశాస్త్రము.

శ్లో॥ యస్యసర్వేసమారంభా కామసంకల్ప వివర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణాం తమాహుః పండితంబుధాః॥

తా॥ ఓ అర్జునుడా! కర్మమునందు అకర్మమును అకర్మమునందు కర్మమును చూచునట్టి ఏవిద్వాంసునియొక్క కర్మములన్నియును కోర్కెలను ఆకోర్కెలకు కారణములైన సంకల్పములనువదలి అనుష్ఠింపబడుచున్నవో కర్మమునందు అకర్మమును అకర్మమునందు కర్మమును చూచుట అనునట్టి జ్ఞానముచేత కాల్పబడిన ఆపురుషుని పండితుండని విద్వాంసులు చెప్పుచున్నారని తాత్పర్యము.

శ్లో॥ త్యక్త్వాకర్మఫలాసంగం నిత్యతృప్తోనిరాశ్రయః।
కర్మణ్యభిప్రవృత్తోపి నైవకించిత్కరోతిసః॥

తా॥ ఓ అర్జునుడా! కర్మమునం దకర్మమును అకర్మమునందు కర్మమును చూచునట్టిపురుషుడు కర్తృత్వాభిమానమును కర్మఫలాపేక్షయునువదలి సర్వకాలములయందును స్వాత్మానందానుభవముచేత తృప్తినిపొందినవాడును ఆధారశూన్యుండును అగుచు కర్మమునందు ప్రవర్తించినప్పటికిని ఒక్కదానిని అనగా ఏకర్మమును జేయుచున్నవాడేకాడనియును అట్లుగాదేని॥

శ్లో॥ నా ప్రుక్తంక్షీయ్యతేకర్మ కల్పకోటి శతైరపి॥

తా॥ తానుజేసిన పుణ్యపాపనులు అనగా అనేక బ్రహ్మకల్పములలో అనుభవించక తప్పదనియును॥

శ్లో॥ బ్రహ్మార్పణంబ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌబ్రహ్మణాహుతమ్।
బ్రహ్మైవ తేనగంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥

తా॥ తానుజేసినకర్మము బ్రహ్మార్పణము జేయువలయు. అట్లు జేసినవాడు ముక్తుడని బంధరహితుడని తెలియవలెను.

శ్లో॥ గతసంగస్యముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞయాచరతఃకర్మ సమగ్రంప్రవిలీయతే॥

తా॥ అభిమానములేనివాడును ధర్మాధర్మములు కామక్రోధములు మొదలగునవి కారణముగాగల సంసారమునుండి విడువబడినవాడును బ్రహ్మజ్ఞానమునందే నిలిచియున్న చిత్తము కలవాడు బ్రహ్మజ్ఞానియని చెప్పబడును.

శ్లో॥ సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ ॥ ౧ ॥
విజ్ఞాన మానందంబ్రహ్మ ॥ ౨ ॥
యతోవాచోనివర్తంతే అప్రాప్య మనసాసహ ... అత్మాసర్వాంతరః ॥ ౩ ॥

తా॥ బ్రహ్మము సత్యజ్ఞానానందరూపమైనది బ్రహ్మము విజ్ఞానానందరూపమైనది ఏబ్రహ్మము జ్ఞానాదులకు అవిషయముగుచు అపరోక్షమైనదో అనగా జ్ఞానస్వరూపముయినదో ఏయాత్మ సర్వాంతర్యామైనదో ఆబ్రహ్మమును తెలుసుకొనుటయే ముక్తుడనబడునని శ్రుతులచే జెప్పబడినదియును నేతినేతి॥ ఇదికాదు- ఇదికాదు - అను వాక్యములచేత జెప్పబడెనని శ్రుతి॥

శ్రుతి॥ నతస్యకశ్చిజ్జనితానచాధిపః ॥ ౧ ॥ అజోనిత్యః॥ ౨ ॥
ఏషసర్వేశ్వరః ॥ ౩ ॥

తా॥ ఆబ్రహ్మమునకు కారణుడును అధిపతియునులేడు ఆబ్రహ్మము పుట్టుకలేనిదియు నిత్యుడు శాశ్వతుడని తెలియవలెను.

శ్లో॥ నాస్తినాస్తిమహాభాగ కలికాలసమంయుగం।
[illegible]

తా॥ కలియుగములో భగవంతుని ధ్యానించుట స్మరించుటమాత్రంబుచేతనే ఉత్తమమైన మోక్షంబు ప్రాప్తమగుచున్నది గాన కలియుగముతో సరియైనయుగము ఒకప్పుడును లేదని తా॥

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకంశరణంవ్రజ।
అహంత్వాం సర్వపాపేభ్యో మోక్ష ఇష్యామిమాశుచ॥

తా॥ సకల ధర్మములను విడిచి ముఖ్యుడనైన నన్ను రక్షకుని గాపొందుము. నేను నిన్ను సకలపాపబంధములవల్లనుంచిన్ని విడిపింపగలవాడను దుఃఖింపకుము అని తాత్పర్యము.

కం॥ రక్షకులు లేనివారల। రక్షించెదననుచు చక్రి రాజైయుం
డక। రక్షించుమనుచు నొకనరు। నక్షమపార్థింప
నేల నాశ్మజ్ఞనకుక॥

తా॥ త్రికరణశుద్ధిగా నన్ను ఏపురుషుడు నమ్మికొని ఇతరము నందాపేక్ష లేకయుండెనేని అతనిని నేను రక్షించుతానని భగవద్వాక్యము ॥ భాగవతము ॥

శ్లో॥ నజాతుకామః కామానా ముపభోగేనశామ్యతి।
హవిసాకృష్ణవర్త్మేన భూయ ఏవాభివర్థతే॥
ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః॥

తా॥ తాను కోరినకోరిక లనుభవించుటచేత కోరినకోరిక లెన్నటికినితగ్గక మరింతయెక్కువౌను. ఆకోరికలన్నియు ఈజన్మమున లభింపనియెడల అనేకజన్మములకు కారణమని తెలియవలెనని నీతిశాస్త్రము.

శ్రు॥ ద్వైతంసంసారమిత్యాహు రద్వైతంపరమార్థతః॥

అను ప్రమాణమునకు విరోధముగా అద్వైతసిద్ధి గలుగక ద్వైతమే ప్రాప్తించును. కాబట్టి॥ శ్రు॥ ఏకమేవాద్వితీయం బ్రహ్మ॥ అను శృత్యర్థము నెఱిగి చిమాత్రిపణియగు ప్రకృతియును అస్మశ్శబ్దవాచ్యండైన సమాత్రిపము పరబ్రహ్మమును ఒకటేయనియును ఆపర బ్రహ్మమే తాననితలంచి అష్టవిధానందములలో శ్రేష్ఠమైన ముఖ్యా

నందమును పొందువాడే ముక్తుడని వేదాంత సిద్ధాంతము కైవల్యనవనీతము.

శ్లో॥ యంలబ్ధ్వాచాపరంలాభం మన్యతేనాధికంతతః।
యస్మిన్ స్థితోనదుఃఖేన గురుణాపివిచాల్యతే॥

తా॥ ఏ యాత్మను బొంది యాత్మలాభముకంటె నధికమైన మరియొకలాభములేదని చెప్పెడి॥

శ్లో॥ ఆత్మలాభాన్నపరంవిద్యతే॥ అనెడి స్మృతిప్రకారము మరియొక లాభమునుకోరడో మరి యేయాత్మతత్వస్థితుడగు యోగి శస్త్రాగ్నిఘాతాది లక్షణము గల మహత్తరమైన దుఃఖముచేతనైనను ప్రహ్లాదునివలె చలనమునుబొందడని పంచదశి॥

శ్లో॥ ఏకైవదృష్టిఃకాకస్య వామదక్షిణనేత్రయోః।
యాత్యాయాత్యేవమానంద ద్వయేతత్త్వవిదోమతిః॥

తా॥ కాకమునకేప్రకారముగా దర్శనసాధనమగు చక్షురింద్రియమొకటిగనే యెడమ కుడినేత్రములయందు ఆప్రకారమే వివేకియొక్క బుద్ధియు బ్రహ్మానంద విషయానందములయందు అనగా నంతయును బ్రహ్మమేయని చూచునని వేదాంతపంచదశి॥

శ్లో॥ ఏవంశ్రుతివిచారాత్ప్రాగ్యధాయద్వస్తుభాసతే।
విచారేణవిపర్యేతి తతస్తచ్చింత్యతాంవియత్॥

తా॥ ఏసద్వస్తువైన బ్రహ్మము మాయాభ్రాంతిచేత యాకాశాదిరూపముగా వర్తించుచున్నదో ఆబ్రహ్మము శ్రుత్యర్థ విచారమును జేయనిపూర్వమందును ఏవస్తువయియుండియున్నదో విచారించిన తరువాత నావస్తువే అనగా ఏసద్రూపమగు బ్రహ్మమేయగుచున్నదో ఆబ్రహ్మమేతానని నమ్మికున్నవాడే ముక్తుడనియును నాతెలివే బ్రహ్మజ్ఞానమని పంచదశి॥

శ్లో॥ బ్రహ్మానందాభిధేగ్రంధే బ్రహ్మానందప్రకాశకం।
యోగిప్రత్యక్షమధ్యాయే ప్రధమేస్మిన్నుదీరితం॥

తా॥ బ్రహ్మానందమనెడి పేరు గల యధ్యాయపంచక గ్రంథమందు సుషుప్త్యవస్థయందును జాగ్రదావస్థకాలమందును సమాధ్య

వస్థయందును సుఖదుఃఖదశయందును స్వప్రకాశాచిద్రూప బ్రహ్మా నందమును ప్రకాశింపజేయునట్టి జ్ఞానయోగికి అనుభవరూపమగు ప్రత్యేక్షము చెప్పబడెను. ఉపనిషద్వాక్యాదుల నిచ్చట జూపుటచేత యోగిప్రత్యక్షమనెడి పదము శ్రీవిద్యారణ్యగురునిచే బ్రయోగించబడె నని తెలియవలెను పంచదశి॥

శ్లో॥ ఏకఏవహింభూతాత్మా భూతేభూతేవ్యవస్థితః।
ఏకధాబహుధాచైవ దృశ్యతేజలచంద్రవత్॥

తా॥ ఒక్కండగు బరమాత్మ బ్రతిభూతమందు నున్నవాడ గుచు జలచంద్రునివలె ఒక్కండుగాను శెక్కండ్రుగాను గనబడుచు న్నాడని మరియొక శ్రుతి చెప్పుచున్నది అనగా మనోవృత్తులయందు బ్రహ్మస్వరూపచిదానందములు ప్రతిఫలించు ననుటయందు నీరెండు వాక్యములును బ్రమాణముగా గ్రహింపబడెనని తెలియవలెను॥

శ్లో॥ మోక్ష్యేహమిత్యత్రయుక్తం చిదాత్మత్వంతథాపుమాన్।
తద్వేత్తిగురుశాస్త్రాభ్యాం నతుకించిచ్చికీర్షతి॥

తా॥ మరియు పురుషుడు ఎపుడు శమదమాదులను సంపాదించి ముక్తినిపొందగలనని తలచునో అప్పుడు గురూపదేశ మహావాక్యార్థ జన్యమైనట్టి అపరోక్షజ్ఞానముచేత నేను విజ్ఞానమయాది కర్త్రాదిస్వ రూపుడనుగాననియు సత్యజ్ఞానానంద స్వరూప పరబ్రహ్మమునైతినని కర్మమునుచేయుట కిచ్ఛలేనివాడై చిద్రూపుడగు పరమాత్మనెరుగుచు న్నాడు. అట్టిపురుషునకు చిద్రూపమునే ముఖ్యాత్మనుగా చెప్పవల యునుగాని విజ్ఞానమయాదికమును ముఖ్యాత్మగాచెప్పందగదు బ్రహ్మ ము సత్యజ్ఞానానంద స్వరూపముగలదనియు విజ్ఞానమానందరూపమ నియు అంతరములేనిదనియు బాహ్యములేదనియు సర్వస్వరూపమని యు ప్రజ్ఞానఘనరూపమనియు॥

శ్రు॥ సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ విజ్ఞానమానందం బ్రహ్మ
అనంతరోబాహ్యఃకృత్స్నః। ప్రజ్ఞానఘనఏవ॥
ఇత్యాది శ్రుతిచెప్పుచున్నది.

అ॥ ఈ వుదహరింపబడిన త్రివిధాత్మలకు వ్యవహారవిశేష

ములయందు యోగ్యత్వముచేత ముఖ్యాత్మత్వము గలుగునేమిటికై యిప్పుడు దృష్టాంతము చెప్పుచున్నాడు॥

శ్లో॥ విప్రక్షత్రాదయోయద్వ ద్బృహస్పతిసవాదిషు।
వ్యవస్థితా స్తథాగౌణ మిథ్యాముఖ్యాయథోచితమ్॥

శ్రుతి॥ బ్రాహ్మణో బృహస్పతీ సవేనయజతే ॥ అనెడు స్థలమందు బృహస్పతి సవనమందు బ్రాహ్మణునకే యేప్రకారము అధికారముగలదో క్షత్రియ వైశ్యులకు అధికారములేదో అట్లును॥

శ్రుతి॥ రాజారాజసూయేన యజతే॥ అనెడు స్థలమందు రాజసూయమనెడు యజ్ఞమందు క్షత్రియునకే యేప్రకారము అధికారముగలదో బ్రాహ్మణులకు వైశ్యులకు అధికారములేదో అట్లును॥

వైశ్యోవైశ్యస్తోమేనయజేతే॥ అనెడు స్థలమందు వైశ్యస్తోమమనెడు జన్నమందు వైశ్యునకేప్రకార మధికారముగలదో బ్రాహ్మణ క్షత్రియులకు అధికారములేదో అట్లును ఈప్రకారమే గౌణాత్మయగు పుత్రాదికమునకును మిథ్యాత్మయగు దేహాదికమునకును ముఖ్యాత్మయగు సాక్షికిని ఈమూటికిని తమకుదగినవ్యవహారములయందు ముఖ్యతత్వము గలుగుచున్నదని తెలియవలెను.

అ॥ ఇప్పుడు ఫలితము జెప్పుచున్నాడు॥ అన్యత్ర ముఖ్యాముఖ్యాత్మలకంటె నన్యవస్తువునందు నిరతిశయప్రీతి మొదలగునవి నియమములుగావని తెలియుటే ఈవిచారమునకు ఫలమనిన విని శిష్యుడు॥ అయ్యా, గురుస్వామీ॥ తొలుత మీరు మదీయహృదయ తాపనివారంబుగా ఉపదేశించిన బ్రహ్మజ్ఞానంబు నీసర్వమతంబులయందేమతం బనంబడు దానికి రూపనామక్రియా చిహ్నంబులెట్టివి? తన్మతాధిష్ఠానదైవంబునకు నామరూపక్రియలెయ్యవి. సాకల్యంబును సంశయరహితంబుగా నాజ్ఞాపించుటయును ఇదియునుంగాక ఈదైవోపాసకులైన వారికీమతంబులెన్నియు దైవంబులెందరు ఇన్నిటికిని నాదిమతం బెద్దియు అట్టిమతమునకు దైవంబెవ్వడు నాదైవంబునం దైక్యభావమెద్దియో ఈప్రశ్నలకన్నింటికిని సదుత్తరంబులు బోధించుమని ప్రార్థించినవిని గురుండు మందస్మిత వదనారవిందుడై శిష్యునకు దెలుప నిశ్చ

యించి యిట్లనియె. గురుండు మఃయంతేవాసి వినుమనియె.

—* మతముల ప్రశంస. *—

మతములనగా॥ ౧ వైష్ణవము ౨ శైవము ౩ శాక్తేయము ౪ గాణాపత్యము ౫ సౌరవము ౬ కాపాలము ఇవి యారును మతములు నిందుకు దైవములవివరము. ౧ వైష్ణవ మతమునకు విష్ణుమూర్తియే దైవమని యారాధింతురు. ౨ శైవమతమునకు శివుడే దైవమని పూజింతురు. ౩ శాక్తేయ మతమునకు శక్తియే దైవంబని కొల్తురు. ౪ గాణాపత్య మతమునకు గణపతే దైవంబని ధ్యానింతురు. ౫ సౌరమతమునకు సూర్యుడే దైవంబని నమస్కరింతురు. ౬ కాపాలమతమునకు బ్రహ్మయే దైవంబని నమ్మికొని వారివారి ఉపాసనబలమువల్ల నాయా దైవముల సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య పదవుల బొందుదురుగాన వారివారలలో అనేక వైరములు బెంచుకొని వారివారి మతదైవముల వాదించుకొనుచు నిందించుకుందు రదెట్లనిన?

సీ॥ విష్ణువెక్కువయంచు వైష్ణవులందురు శివుడెక్కువను
చును శైవులంద్రు । అదియిదిదబ్బరే యనుచుశాక్తే
యులు శక్తిశ్రేష్ఠంబని జాటుచుంద్రు । గణపతేదైవం
బు గానివేరొకదైవ మువనిలో లేదు సత్యం బటంచు।
యొనరగాణాపత్యులును వచించెదరు సకలమతస్థులు
సంభ్రమమున । తమతమ మతోచితములైన దైవము
లనే । శ్రేష్ఠమనిపల్కుచుందురు స్పష్టముగను । గాన
యేదైవమెక్కువో ఘనమతంబు । యెద్దియో వీనిలో
దెల్పు సిద్ధముగను॥ ఇందుకు ప్రశ్న.

శ్లో॥ మన్నాథా శ్రీజగన్నాథ మద్గురో శ్రీజగద్గురో।
మమాత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీగురవేనమః॥

తా॥ మొదటి మూడుపాదములందు గల అర్థము అభ్యాసులకు నమ్మకము గలుగుటకు చెప్పినారు గాని ఆరూఢ భావముగలవారికి చెప్పినది యేమనగా? మమాత్మాసర్వభూతాత్మా॥ అను న్యాయానుసారముగా?

తా॥ మన్నాథుడే నాయుపాసనదైవమే జగత్తుకెల్లా దైవమని యును నాగురుడే ఈప్రపంచమునకెల్లా గురుడనియును నాయాత్మే సర్వభూతములలోవున్నవాడనియును అజ్ఞానులు ఈప్రకారము నమ్మ జాలకున్నవారు ఒకరినొకరు మతదైవముల నిందించు చుందురు. ఇందుకు॥

శ్లో॥ మద్భక్తాశంకర ద్వేషీ మద్వేషీశంకరప్రియః।
తావుభౌనరకంయాంతి యావచ్చంద్రదివాకరః॥

తా॥ విష్ణుభక్తులు శివునిదూషించిన శివభక్తులు విష్ణువునిదూషించిన వారు ఇరు సూర్యచంద్రభూమి యున్నంతవరకు మహాఘోర నరకములోనుందురని భగవద్వాక్యము॥

శ్లో॥ అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభం॥ ౧ ॥
అవశ్యంభావిభావానాం ప్రతీకారోభవేద్యది।
తధాదుఃఖైర్నలిప్యేన నళరామయుధిష్ఠిరః॥ ౨ ॥
మామాత్మపరదేహేషు ప్రద్విషంతోభ్యసూయకాః।
తానహంద్విషతఃకౄరాన్ సంసారేషునరాధమాన్॥
క్షిపామ్యజస్రమశుభా నాసురీష్వేవయోనిషు ॥ ౪ ॥
మామప్రాప్యైవకౌంతేయాం తతోయాంత్యధమాంగతిం॥

తా॥ తనకంటె యితరదేహములందలి నన్ను ద్వేషించుచున్న వారల పరశ్రేయస్సుసహించనివారలై యెవరున్నారో నేను ఆద్వేషులైన కౄరులైన శుభరహితులైన ఆనరాధములను నిరంతరము సంసారమందున్న అసురసంబంధములైన యోనులయందే యుంచుచున్నాను ఓఅర్జునా! ఆఅవివేకులు ప్రతిజన్మములయందున్న అసుర యోనినిపొందినవారలై నన్నుపొందకనే ఆతరువాత నికృష్టగతిని పొందుచున్నారు అని పూర్వోక్తగీతాశాస్త్రమున్నూ, అటువంటి దుర్మార్గుల యమదూతలు॥

క౦॥ మొత్తుదురుగదలమంటల। కెత్తుదురడ్డంబుదేహ మింతెంతలుగా। నొత్తుదురసిపత్రికలను। హత్తుదురుకృతాంతభటులు హరివిరహితులన్॥

# బ్రహ్మజ్ఞానామృతసారము

## ——* అష్టవిధ గురువుల ప్రశంస. *——

౧ బోధక ౨ వేదక ౩ నిషిద్ధ ౪ కామ్యక ౫ సూచక ౬ వాచక ౭ కారణ ౮ విహిత ఈ ౮ న్ని అష్టగురువులును॥

౧ శాస్త్ర శబ్దార్థములు బోధించువాడు బోధకగురు వనంబడును.

౨ తత్వమును దర్శింపజేయువాడు వేదకగురువు.

౩ వశ్యాకర్షణాద్యష్టకర్మలచేత ఇహ పరలోకములయందు మోదఖేదములనిచ్చువాడు నిషిద్ధగురువనంబడును.

౪ పుణ్యకర్మోపదేశములచేత ఇహ పరలోక సుఖములనిచ్చువాడు సూచకగురువనంబడును.

౫ వివేక గుణములచేత శమదమాది సద్గుణంబులు గలుగజేయువాడు కామ్యగురు వనంబడును.

౬ విషయములయందు వైరాగ్యములు గల్గించిన ఆత్మానురాగప్రదుడు వాచకగురువనంబడును.

౭ శివజీవైక్యజ్ఞానమును గలుగజేసినవాడు కారణగురు వనంబడును.

౮ సకల సంశయములనివారించి నిత్యముక్తిని ఘటింపజేయువాడు విహితగురువనంబడును.

ఈ మెనిమిదిమందిలో కారణాచార్యులవద్ద ఉపదేశముపొంది నిత్యము చతుర్విధ శుశ్రూషలు జేయవలెను. తనుధనమనః ప్రాణములు గురునకు దారబోయవలయును. నిత్యము వారిసన్నిధిలోవుండి వేదాంతవిచారణ జేయుచుండవలెను అట్టి శిష్యుడు ఈజన్మముననే మోక్షముబొందునని తెలియవలెను.

సీ॥ సద్గురుధ్యానాత్మ సంపన్నుడగువాని యరకాలివ్రాత
నెవ్వారికిలేదు । సతతంబు కారణాచార్యుజేరినవాని కొ
నగోరబోల నెవ్వనికిగాదు । శ్రీగురుశుశ్రూష సేయనే
ర్చినవాని చరణరేణుసమ మెవ్వరునుగారు। దేశికప్రీతి
గాదిముగ నేర్చినవాని సరిసహస్రాంశ మెవ్వరునుగారు।

దానమౌనచాంద్రాయణ ధ్యానవిహిత । మంత్రతంత్రాధ్యయనజప మర్మకర్మ । తీర్థయాత్రాదిక స్నాన దివ్యధర్మ । జైనాచారు జేరిన వారిసమమే॥

కం॥ గురుశుశ్రూషలు జేయని । నరుకడు సంసార మనెడి నట్టేటమునిం । కరుణాస్తుఁడు బాంధవుఁ డుపా । పరములు లేకుండునెందు బలుకర్మాండై॥ దుర్మతఖండనము.

కం॥ గురుబోధ నెఱిఁగినట్లు । పరిపరివిధమైనశాస్త్ర పాఠవ్యసనం । బెరిగించునె పురుషార్థము । పరిపక్వముగాకవారి భ్రాంతులు గాకన్॥— అను న్యాయానుసారముగా వినుము.

ఇట్లని సకలతత్త్వార్థ దర్పణము.

మతవివాద పరిహారమునందున అఖండమై ఆద్యంత రహితమై అప్రమేయమై అవాఙ్మానసగోచరమై సచ్చిదానందమై స్వయంప్రకాశమై అపరిచ్ఛిన్నమై అనావృతమై అనేకరూపమై అద్వైతమై నిత్యమై నిర్మలమై నామరూపక్రియాతీతమై నానాకారరూపమై సర్వవ్యాపకమై సర్వాంతర్యామియై వెలయుచున్న పరబ్రహ్మమను పదార్థమొకటిగలదు అదియవాఙ్మానసగోచరమై యనిర్వాచ్యమై వెలయునది గనుక వేదములు సహితము తెలుపలేక తుదకదియనిమాత్రము సూచింపుచున్నవి నిరుపమానందమయిన యతనిమహిమలను యతనికనంతనామములు కల్పింపబడినవి నిర్విశేషమయిన యాపరబ్రహ్మము నివాతదీపమువలె నిస్తరంగసముద్రమువలె నిశ్చలమైయున్నను తత్సాన్నిధ్యబలముచేత కాంతమున కెదుటనున్న సూదివలెను నిప్పునందుగల వేడిమివలెను దీపమునననుసరించియున్న నీడవలెను రజ్జువునందు దోచు సర్పమువలెను యెండమావులయందు దోచు జలమువలెను ముత్తెపుచిప్పయందు దోచు వెండివలెను మూలప్రకృతియని యవ్యక్తమని వ్యవహరింపబడును. మాయాశక్తియొకటితోచును ప్రళయకాలమున సూర్యచంద్రాదులు సృజింపబడుటకుముందు దట్టముగా నెల్లెడల నావరించుకొన్న గాఢాంధకారమునే యెల్లప్పుడు మాయయని పెద్దలు జెప్పుదురు. అఖండజ్యోతియగు పరబ్రహ్మమే యొకదీపము తచ్ఛాయయే

మాయ వంధ్యాపుత్రునివలె నాపరబ్రహ్మమందు నతిసూక్ష్మమయిన మాయను తొలగించువాడే కారణగురుడని తెలియవలెననిన గురునకు శిష్యుండు మరల నిట్లనియెననియును॥ శిష్యుడు॥ అయ్యా గురుస్వామీ! అట్టి అవాఙ్మానస గోచరమయిన బ్రహ్మమును నేతీరున కనవలెనో నేతీరున పొందవలెనో ఈరహస్యము నామూలాగ్రముగా బోధించి నన్ను కృతార్థునిగా జేసి రక్షించుమని అనేక వందనము లాచరించిన శిష్యునికి గురుండు దెలుప నారంభించెను.

సీ॥ కలితశబ్దశ్రోత్ర ఘనమనోహంకృతు లదృశ్యములీనికిదృక్కునేను । స్పర్శత్వగింద్రియా చన్మనోహంకృతుల్ దృశ్యములీనికి దృక్కునేను । సలలితరూప లోచనమనోహంకృతుల్ దృశ్యములీనికి దృక్కునేను । కమనీయరసరస జ్ఞానమనోహంకృతుల్ దృశ్యములీనికిదృక్కునేను । అతిసురభినాసికామనోహంకృతులును । దృశ్యములు గానివీనికీ దృక్కునేను । బహువిధాంతర్బహిస్థ ప్రపంచమెల్ల । దృశ్యమట్లపుటపరిపూర్ణ దృక్కునేను॥

తా॥ కలితశబ్దములతో కూడిన మనస్సును ఆమనస్సుతో కూడిన అహంకారమును కనబడునవి ఈశబ్దాదులతో కూడిన మనోహంకృతులకు నేను అఖండసచ్చిదానంద పరిపూర్ణ స్వరూపుడనైన నేను ద్రష్టను ఈపంచవిధస్పర్శములతో కూడిన త్వగింద్రియాధిష్ఠానమైన మనోహంకారములనెడు దృశ్యములకు నేనే దృక్కునై దశవిధరూప సహితమయిన నేత్రేంద్రియములతో కూడిన మానసాది అహంకారములు వీటిని నేనే చూచువాడను మనోజ్ఞములైన సప్తవిధరస సహితమయిన జిహ్వేంద్రియముతో కూడిన మనస్సును హంకారమును వీనికి ద్రష్టను త్రివిధపరిమళయుక్తమయిన ఘ్రాణేంద్రియములగు వానితోకూడి నహంకారములు ఇంద్రియార్థము లగుటవలన ఈవిషయముల ప్రత్యగభిన్న ద్వితీయ బ్రహ్మస్వరూపమయిన నేను అధిష్ఠానమును అధిష్ఠానము లగుటవలన అనేకవిధములైన లోపల వెలుపలనున్నట్టి లోకమంతయు బ్రహ్మాది పిపీలికాంత బహిఃప్రపంచము నంతయు అట్లదృశ్యమగుటవలన నిత్యనిరంజన నిర్వికారుడనైన నేను పరి

పూర్ణ దృక్కుడ్రష్టనని తెలియవలెనని శ్రీరాముడే హనుమంతు నకు బోధించెనని సీతారామాంజనేయము॥

సీ॥ అనియిట్లు బోధించి యానందమయుడగు శ్రీరాఘవుడునిజ శ్రీపదార। విందంబులకుభక్తి వందనంబులుసేయుహనుమంతుగనుగొని యప్పుడతని । శిరమునుపూర్వాద్రిశిఖరంబుపైస్వక రారవిందలము డాయంగజేర్చి । తనరుసహస్తమస్తకయోగమప్పుడే తెలివియైయుండు నాతెలివినీవు । తెలివి నీవనితెల్పగా తెలియునెద్ది । యదియె నీవను వెలుగుచే ననిలసుతుని । ధీగతాద్యవిద్యాంధ తిమిరమెల్ల । బాపి కేవలతత్వరూపంబుజూపె॥

తా॥ అనియిట్లుబోధించి బ్రహ్మానంద స్వరూపియగు శ్రీరాఘవుడైన శ్రీరామమూర్తి తన పదారవిందములకు భక్తిచేత వందనంబులుసేయు హనుమంతునిగనుగొని అతనిశిరస్సనెడు పూర్వాద్రి శిఖరంబుపై తనయొక్క అభయ హస్తమును జేర్చి అనగా హస్తమస్తకమునందునుంచి ఈయొక్కకరము శిరస్సునచేరికను ఏ తెలివియైయుండునో అదియే సూక్ష్మశరీరాది అండపిండ బ్రహ్మాండనానంతయు ఏప్రజ్ఞాన మెరుంగుచున్నదో అదియేనీవను వెలుగుచే ఆప్రజ్ఞానమేనీవనెడు స్వయంప్రకాశముచేత హనుమంతుని యావరించుకున్న అజ్ఞానాంధకార తిమిరమెల్లన్ బాపి బ్రహ్మస్వరూపునిగా జేసెనని తెలియున్.

సీ॥ వేదాంతమనుచు బ్రహ్మరులెంచిన వెలుగు నాదాంతసీమ యందలువెలుగు । సాధుజనానంద సంపూర్ణమగు వెలుగు బోధకునిల యమైపొసగవెలుగు । ద్విదలాగ్నిమధ్యమున ఉదయమైనవెలుంగు సుషుమ్నా నాళంబు జొచ్చి వెలుగు । చూడచూడగమహా శోభితంబుగ వెలుగునిఖిలజగంబులా నిండె వెలుగు । శతకోటిసమరనాపితులమించిన వెలుగు మేరువశిఖరంబు మీదవెలుగు । అట్టివెలుగునుబాంహ్యాంతరమున। దెలియనేర్చిన నతడెబహు దేముడనగ । మదనగోపాలమునిజ హృదయలోల । శేషశోభాంగభక్తసంత్రాణశీల॥

తా॥ అఖండాకార పరబ్రహ్మస్వరూపమైన అనగా ఆత్మస్వరూపమైన వెలుగు విష్ణు బ్రహ్మరుద్రాదులకు పొందనలవిగానట్టి

తేజస్సు సాధులయందు ఏయానందమఃండియుండునో ఆవెలుగు సర్వ త్రానిండియున్నదని తెలియవలెను.

శ్లో॥ అచింత్యా వ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే।
సమస్తజగదాధార మూర్తయే బ్రహ్మణేనమః॥

అను మహావాక్యార్థను పరమాదరబుద్ధితో నాలకించి సత్యార్థమును గ్రహించు మహనీయు లీజన్మముననే మోక్షప్రాప్తు లవుదురని నీతిశాస్త్రము అనగా మహావాక్యార్థమని తెలియవలెను.

శ్లో॥ మనోహిద్వివిధంప్రోక్తం శుద్ధంచా శుద్ధమేవచ।
అశుద్ధంకామసంకల్పం శుద్ధంకామ వివర్జితం॥

శ్లో॥ మనఏవమనుష్యాణాం కారణంబంధమోక్షయోః।
బంధాయవిషయాసక్తం ముక్త్యైనిర్విషయంస్మృతమ్॥

తా॥ అని అమృతబిందూపనిషత్తు చెప్పుచున్నది. శుద్ధమనియు అశుద్ధమనియు మనస్సు రెండువిధములు. బాహ్యవస్తువులనుచూచుకోరికగలుగజేయునది యశుద్ధమనస్సు ఏవస్తువును కోరిక నిస్పృహమై యుండునది శుద్ధమనస్సు అశుద్ధమనస్సు బంధప్రాప్తిని గలిగించును. శుద్ధమనస్సు మోక్షమునకు హేతువగును కావున బంధమోక్షములు రెంటికిని మనస్సుకారణమనియును పురుషుడు యెన్నికోర్కెలుకోరునో నవియన్నియు అనుభవించుటకు జన్మములనేకమువచ్చును కాబట్టి శుద్ధమనస్సున పరబ్రహ్మమును ధ్యానింపుచు నేనుండవలయునని తెలియవలయును.

శ్లో॥ బ్రహ్మచిద్బ్రహ్మభువనం బ్రహ్మభూతపరంపరా।
బ్రహ్మాహంబ్రహ్మమచ్ఛత్రుర్బ్రహ్మమన్మిత్రబాంధవః॥ ౧ ॥
సర్వమేవహిబ్రహ్మేతి భావితేబ్రహ్మవైపుమాన్।
పీతేమృతేమృతమయః కోనామానభవేత్కిల॥

తా॥ చిత్తు బ్రహ్మమే లోకము బ్రహ్మమే భూతజాలము బ్రహ్మమే నేను బ్రహ్మమే నాశత్రుమిత్రులు బ్రహ్మమే నాబంధువులు బ్రహ్మమే సర్వము బ్రహ్మమేయనిభావింపగ పురుషుడు బ్రహ్మమేయగుచున్నాడు. అమృతమును పానముసేయువాడు అమృతమ

యును గాకుండునాయని నీతిశాస్త్రమని తెలియుడీ॥

సీ॥ గురుపదాంభోజముల్ గొలువక గల్గునే ప్రవిమలవైరాగ్య భాగ్యమహిమ। గురుపాదతీర్థంబు గ్రోలక కల్గునే జ్ఞానవిజ్ఞానయోగానుభవము। గురుసుప్రసాదంబు గొనకున్న గల్గునే ప్రతిలేనిచిత్తోపరతి సుఖంబు। గురుతత్వమాత్మ గన్గొనకున్న గల్గునే నిరతిశయంబైన పరమపదము। అట్లుగావున విద్యార్థియైన వాని। వినయభయభక్తులెదలోన బెనగొనంగ। నలుచతుర్విధశుశ్రూషలాచరించి। కొనుచు ననిశంబు గురువుల గొలుచు ననఘ॥

తా॥ గురు చరణారవిందములను పరబ్రహ్మతత్వంపదములని మొక్కకున్న ప్రవిమలమహిమ కల్గునే ఆచార్యుని పాదోదకమును అనగా తీర్థము పానముచేయక అపరోక్షజ్ఞానము కల్గునే గురుప్రసాదంబు భుజింపక ప్రతిలేని చిత్తోపరతి సుఖంబు గల్గునే తత్పదలక్ష్యార్థమైన గురుస్వరూపమును పరబ్రహ్మస్వరూపమని త్వంపదలక్ష్యార్థ ప్రత్యగాత్మయైన తనయందు గన్గొనకున్నచో సర్వోత్కృష్టమైన పరమపదము దొరుకునా బ్రహ్మజ్ఞానాసక్తుడైన శిష్యుడు వినయభక్తులు గురువునందు విశ్వాసము తనహృదయమందు కలుగక మోక్షము సిద్ధముగా దొరుకునా? నిత్యము గురునకు చతుర్విధములైన స్థానాంగ భావాత్మలని నాలుగుశుశ్రూషలు జేయవలయును. ప్రణవమందలి అకార ఉకార మకారములకు లక్ష్యార్థమగు ద్రష్టస్థానమున ఎరుకపురుపులు లేనియునికితో విచారణ జేయుటే స్థానశుశ్రూషయనియును సూర్య చంద్ర బ్రహ్మ విష్ణు రుద్రాదులే కన్నులు మొదలగు నవయవయములని యెరుగుట అంగశుశ్రూష యనియును పరబ్రహ్మము త్రికాలబాధ్యమైనది. ఆబ్రహ్మమే తానని భావించుట భావశుశ్రూషయనియును ఆత్మకాత్మనే ప్రియమైనట్లు పుత్ర కళత్రాదులందు ప్రియమువలె పరబ్రహ్మమైన తనయందు తాను దప్పకయుండుట యాత్మశుశ్రూషయనియును ఈనాలుగు శుశ్రూషలు గురునకు జేయనివానికి మోక్షము సిద్ధింపదని తెలియుటే ఈవిచారమునకు ఫలము.

శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురోరుచ్ఛిష్టభోజనం।
గురుమూర్తిఃసదాధ్యానం గురుమంత్రంసదాజపేత్॥
అని తెలియవలెను.

—* అమనస్క ప్రశంస. *—

సీ॥ మునుదండకారుణ్య మునసోకర్షపుణ్యాశ్ర మమునదాపస వేషమమరదాల్చి। బ్రహ్మర్షిలోక సభామధ్యమంబున నురుసుఖాసీన తనొప్పచున్న। ననుజూడగాగోరిమునికన్యకలుసీత ముందట నిడుకొని ముదితయితడా। యతడాసీపతియని యచటిమానులబ్రీతి విభజించి యడుగనవ్వేలదిసిగ్గు। కలిమి వారల నందగ కాదుకాడ। టంచుదల యూచుచుండినన్ గాంచినప్పు। డొకటనొన్ గాడనక యూరకుండె। నత్తెరంగుగని సంతసిల్లిరా రమణులెల్ల॥

తా॥ శ్రీరాముడే పరబ్రహ్మమనియు సీతాదేవియే సద్బుద్ధియనియు మునికన్యలే జీవుడనియు అట్టిజీవాత్మ తానే పరమాత్మయని భావించి తన సమ్మంధమైన వికారములనే ముప్పదియారు తత్వములను నేతినేతివాక్యంబున తాను జ్ఞానబుద్ధిని ముందునిడుకొని బ్రహ్మమును వెదకుచు నిదియా యదియా యని అడుగగా కాదుకాదు అను బుద్ధియు ఆయాత్మసన్నిధికివెళ్ళగా నిట్టిదట్టిదని వర్ణింప నలవిగాని బ్రహ్మమును గాంచగానే బుద్ధియు స్తంభీభూతమై అవును కాదనజాలక నూరకున్నసమయంబున శ్రీరామునిగని సీత నూరకుండగా ముని కన్యలు రాముడితడనిదర్శించి సంతసిల్లినట్లుగా జీవాత్మ తన్ను తానే నని సౌజ్ఞయని తెలియవలెను.

గీ॥ ధరణిలోపలనారారు తత్వములకు। నవ్వలై యున్న తత్వంబు నెవ్వడెరుగు। శివుడు గురురూపమునవచ్చి జెప్పకున్న। నవ్యతరభోగిశ్రీసదానందయోగి॥

తా॥ సాధనసంపత్తి గల అనగా సత్యవంతుండైన గురుడు తత్వార్థమునుదెల్పిన తనయాచార్యుడు సాక్షాత్తు పరమాత్ముండనియే శిష్యుడు ఘట్టిగానమ్మునో అట్టివాడు కడతేరునని నమ్మవలయును. ముప్పదియారు తత్వములనగా, జ్ఞానేంద్రియములైదు కర్మేంద్రియం

బుద్ధులైదు ౫ ప్రాణవాయువులైదు ౫ పంచభూతములైదు ౫ షడూర్ములారు ౬ హరివర్గములారు ౬ మనస్సు బుద్ధి చిత్తము అహంకారము యివి ౪ ఈముప్పదియారుతత్వముల కతీతుడై సర్వము నిండియున్నదేపరమాత్మ అట్టి పరాత్పరుడే గురుడని భావించువాడే శిష్యుడునతడే కడతేరునని తెలియుటే ఈవిచారమునకు ఫలము.

## —* జీవేశ్వరైక్యప్రశంస. *—

అహంబ్రహ్మాస్మి ప్రజ్ఞానంబ్రహ్మ అయమాత్మా బ్రహ్మ తత్వమసి ఈనాలుగు మహావాక్యములు అర్థము గురురూపకముగా దెలియవలెను. జీవునకు అంతఃకరణాద్యభిమానములున్ను గుణత్రయ దేహత్రయ కర్తృత్వ భోక్తృత్వము మొదలైనవి గుణములున్ను ఈశ్వరునకు సమష్టి అవస్థాత్రయములున్ను హంకర్త హంభోక్తయనియును ఆశాపాశములున్ను దేహత్రయములున్ను సర్వజ్ఞత్వమున్ను సర్వేశ్వరత్వమున్ను సర్వాంతర్యామి ఇత్యాదులు ఈశ్వరుని గుణములు. త్వంపదవాచ్యుడైన జీవునకును తత్పదవాచ్యుడైన ఈశ్వరునకును ఐక్యము. అనగా యిద్దరు ఒకవస్తువగావడము ఇందుకు జీవునకు వాచ్యార్థమైన దేహేంద్రియాద్యభిమానములు వాచ్యార్థము. ఇన్నింటికిని సాక్షియైన సచ్చిదానందమే లక్ష్యార్థము. త్వంపదవాచ్యుడైన ఈశ్వరునకు లోకములోగల సకల శరీరములున్ను సకల అవస్థలున్ను మొదలుగాగల నన్నియును వాచ్యార్థము ఈసకలశరీరేంద్రియములకును సాక్షియైన సచ్చిదానందమే లక్ష్యార్థము జీవునియొక్క వాచ్యార్థమును ఈశ్వరునియొక్క వాచ్యార్థమును విడచి జీవ ఈశ్వరుల లక్ష్యార్థమును ఒకటిగా భావించినయెడల అనగా నీళ్లునిండినకుండటువంటివాడు జీవుడు. నీళ్ళునిండావున్న చెరువటువంటివాడు ఈశ్వరుడు. ఇందులో కుండవాచ్యార్థము కుండలోవున్ననీళ్లు లక్ష్యార్థము చెరువు వాచ్యార్థము చెరువులోవున్ననీళ్ళు లక్ష్యార్థము వాచ్యార్థమైన కుండను చెరువునువిడచి లక్ష్యార్థమైననీళ్ళన్ని భేదములేక ఒకటైనవిధమున లక్ష్యార్థమైనసచ్చిదానందమే తానని జీవుడు మనస్సును చిత్తమందు చిత్తము బుద్ధియందు బుద్ధిని అహంకారమందు అహంకార

మును అంతఃకరణమందు అంతఃకరణను పృథివియందు పృథ్విని జల మందు జలమును అగ్నియందు అగ్ని వాయువునందు వాయువును ఆకాశమందు నాకాశము ఆవరణమందు నావరణము విక్షేపమందు విక్షేపము మాయయందు మాయను అంధకారమునందు నంధకార ము క్రియాశక్తియందు క్రియాశక్తిని ఇచ్ఛాశక్తియందు నిచ్ఛాశక్తిని ప్రళయమందు ప్రళయమును మహాతత్వమునందు మహాతత్వమును మలినప్రధానమైన మాయాతమస్సునందు అట్టి మాయాతమస్సును అమలమాయాప్రధానమైన నెరుకయందు నెరుకను మరువునందు మరువును నిరాకార నిర్వికార నిరీహ నిర్గుణ నిర్వికల్ప నిరాధారనిరా మయ నద్వైత పరబ్రహ్మతీతమైన నిశ్శబ్దం బ్రహ్మోచ్యతే॥ అనునట్టి నిదియే బ్రహ్మైక్యమనియు మోక్షమనియు ముక్తియనియు ముక్తికాం తను వరించుటనియు పరమనియు పరిపూర్ణమనియు జన్మరాహిత్యమ నియు తురీయాతీతమనియు అతీతమనియు వాగ్రికమనియు సద్గురు స్థానమనియు అచలమనియు అచలాంతరాధమనియు ఉన్మనియనియు జీవ ఈశ్వరమాయప్రతిబింబేశ్వరులైన ప్రత్యగాత్మ పరమాత్మల కైక్యము ఇదియే బ్రహ్మజ్ఞానమనిబోధించిన సద్బోధవిని శిష్యుడు గురు నకు అనేకము దండప్రణామంబులాచరించి నేను మీవల్ల అనేక సంశ యములుదీర్చుకొని కృతార్థుడనైతినని పదేపదే వందనంబు లాచరించి స్వేచ్ఛగా వెళ్ళిపోయెను.

కం॥ మంగళముల్ శ్రీగురునకు । మంగళమచ్చాంబమణికి మైథి లిపతికిన్ । మంగళమాతలిదండ్రికి । మంగళము కలక్ష్మీపతికి మహీ లోనెపుడున్॥ ౧ ॥ పంచశరమింద్రియంబులు । పంచముఖానందభాద్ర పదశుద్ధియా । నుంచిది రవివారంబుకు । అంచితముగ జెప్పిరాము కర్పణజేస్తిన్॥ ... ... ... *

ఏతత్సర్వంబును శ్రీసీతారామార్పణమస్తు.

[illegible]రుం భజేభజేభజే. శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ.